# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౭]     అక్టోబరు 1948     [సంచిక ౧౦



### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువమైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒక్కేవక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.






బట్టలుతకడానికి కేరళవాష్
వెల్ బార్ సబ్బే కావాలని
దీక్షపూనండి. ఉతకడం
సులభం, ఉతుకుచాక,
ఎంతో నురుగు, సులభంగా
మురికి పోగొడుతుంది;
శీఘ్రంగా ఉతకడానికి
వీలుండడంచేత, కేరళా
వాష్ వెల్ బారు సబ్బుతో
ఉతికినగుడ్డలు చాలారోజులు
మన్నుతవి. "గృహలక్ష్మి"
కది ఆదర్శప్రాయమైన
సబ్బు. ఉపయోగించండి.

**Kerala**




FAS-KS 2

*Manufacturers*

**Kerala Soap Institute, Calicut**

# విషయసూచిక



ప్రధానవ్యాసములు :—



**ముఖచిత్రం : చెన్నరాష్ట్రపు గవర్నరుపతి**



శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీసాహెబా విజయలక్ష్మీదేవిగారు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

## "మహిళా సంఘాభివృద్ధిలో మద్రాసు పురోగామి"

అఖిలభారత మహిళామహాసభ మద్రాసుశాఖవారి వార్షిక సమావేశమున కధ్యక్షతవహించి శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీసాహెబావారు గావించిన యుపన్యాసమును పిదప ప్రక్కపుటలో ప్రచురించివున్నాము. మహిళాసంఘాభివృద్ధిలో మద్రాసు ఇతరరాష్ట్రములకు పురోగమిగా ఉన్నదని ఆమె ప్రశంసించినది. అది సమంజసము. భారత దేశంలో మహిళోద్యమానికి మొలకవేసిన - అనిబిసెంటు, కజిన్సుసతిగార్ల కార్యక్షేత్రము, మద్రాసు. సంఘసంస్కరణోద్యమ పితామహులు వీరేశలింగం పంతులు గారి శతవార్షికోద్యమం మొన్న మొన్ననే చేశాము. ఉత్తరభారత దేశాన్ని పట్టిపాలారుస్తున్న-పరదాపద్ధతి - చెన్నరాష్ట్రంలో ఏ రెండు మూడు కులాల్లోనోతప్ప - లేనేలేదు.

గవర్నరుసతి శ్రీ విజయలక్ష్మిదేవిగారు మరొక్క ముఖ్యవిషయమున మహిళామణులను హెచ్చరించియున్నారు. మహిళోద్యమము చిరకాలమునుంచీ, సాగుతున్నా

ముఖ్యంగా రాజకీయోద్యమం విజృంభించిన తరువాత పుష్టి చెందినది. గత 30 సం॥ల నుండీ, రాజకీయోద్యమము ప్రభుత్వముతో సహకారం నిరాకరించినది. అయితే నేడు స్వాతంత్ర్యం సిద్ధించినది. దేశీయప్రభుత్వము లేర్పడినవి. స్త్రీల అభివృద్ధి కార్యక్రమము - ఆప్రభుత్వముల పునర్నిర్మాణ కార్యక్రమాలలో ప్రాధాన్యత వహించియున్నది. కాని ఇంకా కొన్ని రాజకీయకక్షలు దేశీయప్రభుత్వంయెడల కూడా వైరుధ్యభావం వహించియున్నవి. కాబట్టి మహిళాలోకానికి - దేశీయప్రభుత్వాలతో సాధ్యమైనంత సహకారం చూపి, వీలైనంతవరకు వారివల్ల మహిళాభ్యుదయానికి సాహాయ్యంపొందండి అని శ్రీ శ్రీ శ్రీ మహారాణిసాహెబావారు సకాలంలో ఇచ్చినసందేశం ఉత్తమోత్తమమైనది. అవశ్యము ఆచరింపదగినది.

---

అఖిలభారత మహిళామహాసభా మద్రాసుశాఖ

వార్షికోత్సవమున కధ్యక్షత వహించిన

# శ్రీ శ్రీ శ్రీ భావనగర్ మహారాణీవారి ఉపన్యాసము

మీ సాంవత్సరిక నివేదిక చదివినాను. స్త్రీలహక్కులకొరకు మీరు గావించిన కృషికి గర్విస్తున్నాను. గత 30 సం॥లుగా ఈ సభానిర్వాహకులు గావించినకృషి ప్రశంసనీయము. బహుభార్యా వివాహనిషేధపుబిల్లును మీరు బలపరచి కృషిచేసినందుకున్నూ మిమ్ములను మెచ్చుకొనుచున్నాను.

మనల నెదుర్కొంటున్న ఎన్నో సమస్యలను పరిష్కరింపను, రోజురోజునకు స్త్రీల సంఘముల అవసరము హెచ్చుచున్నది. ఈ సందర్భములో మద్రాసు ఇతరరాష్ట్రములకు పురోగామియైయున్నది.

స్వాతంత్ర్యసిద్ధి అనంతరము స్త్రీలకు బాధ్యతలు ఎక్కువైనవి. మనకెప్పుడును ప్రభుత్వసహాయము అవసరము. అట్లని మనము చేతులుకట్టుకొని కూర్చుండి ప్రతివిషయమునను ప్రభుత్వసహాయ మపేక్షించుచుండవలెనని కాదు కాని మనము ప్రభుత్వమునకు సహకారమొనర్చి వారివల్ల ఏసహాయము లభించినను పొందదగును. కావున స్త్రీల యభివృద్ధికై, ప్రభుత్వముగావించు కృషిలోను, సామాన్యపరిపాలనా నిర్వహణములోను, సాధ్యమైనంతవరకు వారితో సహకారమొనర్పుడు అని మిమ్ము హెచ్చరించుచున్నాను.

---

# కీ. శే. శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు

(జననం 11-11-1899 — మరణం 26-2-1946)

(అశ్రుతర్పణ - సోదరి - శ్రీమతి సత్తిరాజు సూర్యకాంతమ్మగారు)

పశ్చిమగోదావరిజిల్లా నరసాపురమందు 1899 సంవత్సరం నవంబరు 11 వ తేదీని శ్రీ నిడుమోలు లక్ష్మీనారాయణ పంతులుగారి జ్యేష్ఠపుత్రికగా, తల్లి సూరమ్మగారి గర్భశుక్తిముక్తాఫలముగా, శ్రీ రాజరాజేశ్వరమ్మగారు జన్మించిరి నలుగురు తోబుట్టువులు, ఆర్గురు సహోదరులతో విరాజిల్లు సంపన్న నియోగి బ్రాహ్మణకుటుంబమున బుట్టిరి. ప్రకృతమందు కృష్ణాజిల్లా పబ్లిక్ ప్రాసిక్యూటరు, గవర్నమెంటుప్లీడరుగా వ్యవహరిస్తూ, మచిలీబందరులో నివసిస్తున్న, బారిష్టరు తుర్లపాటి వేంకటేశ్వరరావుపంతులు (సీనియర్ ప్రొప్రయిటర్, అడవిరావులపాడు అగ్రహారం)గారికి ధర్మపత్నిగా 10-6-1910 తేదీని, పాణిగ్రహణము గావింపబడిరి. తదాదిగా 26-2-1946 న, భౌతికశరీరము విసర్జించువరకూ ఆదర్శప్రాయమైన విశిష్టజీవితము గడిపి, స్మారకచిహ్నములుగా కొన్నిసంస్థలను చిరస్మరణీయములుగా నెలకొల్పి కీర్తిశేషురాలైరి. బాల్యమునందే కాపురమునకు వచ్చిన కొలదిరోజులకే బారిష్టరుపరీక్ష చదువుటకు భర్త ఇంగ్లాండుపయనమగుటయు, అచ్చట 'ప్లూరసీ' వ్యాధి అంకురించి మద్రాసు వచ్చివేయుటయు, మద్రాసులో ఆపరేషను, విజయవంతంగా 'నిబ్లాక్' దొరచే చేయబడుటయూ, ఆ యాపత్కాలమందు పదునారేండ్ల లేతవయస్సులో సర్వవిధాలా భర్తకు శుశ్రూషసల్పి ఆరోగ్యప్రాప్తికి తోడ్పడుటయూ, కొంచెం స్వస్థత కుదరగానే అసంపూర్తిగానున్న చదువు పూర్తిచేసి వచ్చుటకు, భర్త తిరిగి ఇంగ్లాండుకు వెళ్లుటయూ, బారిష్టరుగా వచ్చి 1919 లో విజయవాడ (బెజవాడ) లో అడ్వొకేటుగా ప్రాక్టీసు ప్రారంభించుటయూ జరిగినవి. అప్పటినుంచీ భార్యాభర్తలు విధి వేరుచేసే వరకూ ఒకర్నివిడచి ఒకరు ఉండలేదని చెప్పటంలో అతిశయోక్తి ఏమీ ఉండదు. బారిష్టరుగారికి సూరేకారం పాలు కొంచెం ఎక్కువ, అయితేనేమి హృదయం అతివిశాలము, మార్దవమూ గలినదగుటచే ఆయన కోపం టాటాకుమంటలా గుప్పుమనేదే కాని హానికరమైనదికాదని గ్రహించి, అతి మెలుకువతో ప్రవర్తించేది ఈ దంపతులకు పరాత్పరుడు సంతానప్రాప్తి కలుగచేయలేదన్న మాటేగాని, ఇంటినిండా ఎప్పుడూ పిల్లలతో కలకల్లాడుతూ ఉండేది.

రాజరాజేశ్వరమ్మ ఒక ఆదర్శగృహిణి. నౌకర్లు, చాకర్లు ఎందరున్నా స్వయంగా దగ్గరఉండి అన్ని గృహకృత్యాలూ నిర్వహించుకునేది. ఆమె తమ గృహాన్ని ఉంచినంత శుచి, శుభ్రతలతో మనలో నూటికో, కోటికో ఒకరు ఉంచుతున్నారేమో. వారింటికి అతిథులుగా వచ్చిన పాశ్చాత్యులే, శుభ్రతనూ గృహాలంకారమునూ చూచి విస్మయం చెందేవారంటే ఆశ్చర్యంలేదు. ఏదేశంనుంచి, ఏ రాష్ట్రంనుంచి ఏ ప్రముఖులు వచ్చినా, వారింట్లో మకాంవేసి రాజేశ్వరమ్మగారి ఆతిథ్యం పొందుతూ ఉండవల్సినదే. గాంధిమహాత్ముడు 1919 లో ఆంధ్రదేశపర్యటన చేసినప్పుడు బెజవాడలో శ్రీ రాజరాజేశ్వరమ్మగారి అతిథిగా వారినీ, వారున్నగృహాన్నీ పావనం చేశారు. తదాది మహాత్ముని ఆదేశానుసారంగా భార్యాభర్త లిద్దరు కూడా, విధిగా ఖద్దరునే ధరిస్తూ ఆయన అనుచరులయ్యారు.

స్వయంకృషి, భర్త ప్రోత్సాహ సహాయాలతో, ఇంగ్లీషు, హిందీ భాషలందు, మంచి ప్రావీణ్యత గణింప గల్గినది. ఈ భాషాప్రవేశం ఆమె, ఆంధ్రదేశపు ప్రతినిధిగా, దేశమంతటనూ వివిధ రాష్ట్రాలలో జరిగిన అఖిలభారతమహిళామండలి వార్షికసమావేశాలకు వెళ్లినప్పుడు, బాగా ఉపయోగ

పడింది. సింహళద్వీపానికి కూడా ఒకఏడు అట్టిసభకు ప్రతినిధిగా రాజేశ్వరమ్మగారు వెళ్ళారు. ఢిల్లీలో 1928లో జరిగిన అఖిలభారతమహిళామహాసభకు వెళ్లి తిరిగి రాగానే విజయవాడలో దాని శాఖగా స్థానిక మహిళామండలిని స్థాపించి — 1943 లో తన ఆరోగ్యం చెడునంతవరకూ - కార్యదర్శిగనో, కోశాధికారిణిగనో భారము వహించి, పౌరస్త్రీల, సర్వతోముఖాభ్యున్నతికి విశేషంగా పాటుపడి యుండిరి.

స్త్రీజనోద్ధరణకై రాజేశ్వరమ్మగారు సల్పిన కృషి అపారము. తమగృహ ఆవరణములోనే స్వంత ఖర్చుతో అనాధశిశుపోషణాలయం నెలకొల్పి, అందు పతితలగు స్త్రీలకు శరణ్య మొసగటమే కాక వారి శిశువులను పెంచుచూ వచ్చిరి. అట్టి శిశువులెందరో ఇప్పుడు సంపన్నగృహస్థులచే తమ కన్నబిడ్డలుగా పెంచబడుచూ అభివృద్ధి పొందు చున్నారు. గుంటూరునందలి 'ఉన్నవ' దంపతులచే స్థాపించబడిన శ్రీ శారదానికేతనము ప్రారంభించినది మొదలు, దానిపాలకవర్గపు సభ్యురాలుగా ఉండి సర్వవిధాలా సహాయపడుచూ వచ్చిరి. 1934 లో విజయవాడలో కె. బి. మాధవాగారి ఆధిపత్యమున జరిగిన "ప్రధమ దక్షిణ హిందూదేశ గ్రంథాలయ సమ్మేళనకు" ఈమె ఆహ్వానసంఘాధ్యక్షురాలుగా గ్రంథాలయోద్యమానికి దోహద మిచ్చుటయేగాక, తనచే స్థాపించబడిన 'విజయవాడపట్టణ మహిళా మండలి'లో స్త్రీలకు ఉచిత గ్రంథాలయం ప్రత్యేకంగా ఏర్పాటు గావించారు. ఆరోగ్యవిషయంలో కూడా ఆమెకుగల శ్రద్ధ నిరూపించుటకు విజయవాడలో స్థాపితమై, ప్రజాసేవ చేయుచున్న 'శ్రీరామమోహన ఆయుర్వేదధర్మ వైద్యశాలకు' ఉపాధ్యక్షురాలుగా ఎన్నుకొనబడి యుండటమే తార్కాణము. ఆయుర్వేదవైద్య విధానమందే ఆమెకు మిక్కుటమగు అభిమానమూ, నమ్మకము కూడా. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారే ఆమెకు చికిత్సచేసిరి.

ఈమె ఆంధ్రజిల్లాలలోని కొన్ని మహిళామండలి సమావేశాల కధ్యక్షురాలుగనూ, కృష్ణాజిల్లాలో జరిగిన సభలకు ఆహ్వానసంఘాధ్యక్షురాలుగానూ ఒసగిన గంభీరోపన్యాసాలు చదివినవారికి, విన్నవారికి వీరి సేవాతత్పరత గోచరం కాగలదు. మహాత్ముని సందేశాలనూ, ఆశయాలనూ కేవలం ఉపన్యాస ప్రాయంగా వెలిబుచ్చి తృప్తి చెందక, అక్షరాలా ఆచరణాత్మకంగా తనజీవితంలో సాధించిన పూజ్యురాలు.

హరిజనోద్ధరణ అస్పృశ్యతానివారణలకు ఈమె ఎక్కువ శ్రమపడేది. ఇప్పుడు మంత్రిపదవి అలంకరిస్తున్న శ్రీ వేముల కూర్మయ్యయు, ఆయన భార్యయు విజయవాడలో స్థాపించిన 'శ్రీ అంజనాదేవి వసతిగృహం'పు పాలకవర్గంలో ప్రముఖస్థానం ఈమె అలంకరించి హరిజన బాలికలకు తోడ్పడిరి.

గ్రామపరిశ్రమాభివృద్ధి స్కీములో చాలకాలము ఈమె పనిచేసి కాశీశ్వరరావుపంతులుగారిచే నెలకొల్పబడిన కొండపల్లిబొమ్మలు తయారుచేసే సంఘానికి కార్యదర్శినిగా అవసానకాలంవరకూ వ్యవహరిస్తూ, ఆ పరిశ్రమను ఎక్కువ వృద్ధిలోకితెచ్చి, దేశమంతటనూ కొండపల్లిబొమ్మలు వ్యాపించటానికి తోడ్పడిరి.

రాజకీయంగా కాంగ్రెసుసంస్థకుచెంది కాంగ్రెసు అభ్యర్థినిగా రెండుపర్యాయములు పురపాలక సంఘానికీ, క్రిష్ణాజిల్లాబోర్డుకూ, సభ్యురాలుగా ఎన్నుకోబడి జిల్లాలోనూ, విజయవాడపురమందునూ విరివిగా శిశుపోషణాలయములు, ప్రసూతిగృహాలూ ఏర్పాటు చేయించి, స్త్రీవిద్య విషయంలోకూడా తోడ్పడ గలిగినది. రౌలట్ ఆక్టు సత్యాగ్రహ సందర్భంలో ముందంజవేసింది. 1942లో మహాత్ముని ఆజ్ఞానుసారం పదవులకు రాజీనిస్తూ కారాగృహవాసానికి సంసిద్ధముగా నున్నట్లు సంతకాలు పెట్టిన వారిలో రాజరాజేశ్వరమ్మగారు కూడా ఒకరు. విదేశవస్త్ర బహిష్కరణోద్యమసందర్భంలో అహోరాత్రములు దుకాణాలవద్ద పికెటింగు జర్పిన దీమె. ఆరోగ్యము చెడనంతవరకూ గాంధిజయంతోత్సవ సందర్భాలలో ఏటేటా ఖద్దరువస్త్రాలు భుజాలపై వేసుకుని ఇంటింటికీ తిరిగి విక్రయిస్తూ, గవర్నమెంటు ఉద్యోగస్తులచేతనే ముఖ్యంగా ఖద్దరు కొనిపించేది.

మహాత్ముని నిర్మాణకార్యక్రమంలోని హిందీ ప్రచారవిషయంలో రాజేశ్వరమ్మగారు ఎక్కువపట్టు దలతో వ్యవహరించారు. ఆంధ్రదేశంలో ఏర్పడిన 'దక్షిణ హిందీ ప్రచారక సంఘంలో' ఈమె చాలా సంవత్సరాలు, ఉపాధ్యక్షురాలుగనూ సభ్యురాలు గనూఉండి ప్రచారం జరిపారు.

ఇంక మతాచారవిషయాలలో నీమె సదాచార ఆర్వేలనియోగి కుటుంబమున బుట్టి, శైవుడగు నియోగిలింగధారిని చేపట్టిన బ్రాహ్మణి అయియుం డియూ యేకేశ్వరోపాసనను, కుల మతభేదములులేక స్త్రీబాలికంతకూ, అర్హతగలదని నమ్మకము గల్గియుం డెడిది. విజయవాడ యువతీజన ప్రార్ధనసమాజశ మున 1935 లో ఈమె అధ్యక్షోపన్యాసంలో పై చెప్పిన ఆశయం వెలిబుచ్చిరి ఇందుకుతార్కాణంగా రాజేశ్వరమ్మగారు చేసిన లెక్కకుమించిన విందులలో నేమి. సాధారణ సమయము లందేమి, శ్రోత్రియులు, ఆహితాగ్నులు, వివిధ వర్ణాలవారూ, శ్రీమంతులూ, సంఘబహిష్కృతులూ అందరూ ఏకముగా భోజ నాలు చేస్తుండేవారు ఆవిందు సమయాలలో, నిష్క లంకమైన మేలిమి బంగారు వన్నెను ధిక్కరించు మైచాయతో, ఇంటిపూదోటలో పుష్కలముగా పూసిన విరజాజులు శిఖనముడిచి, ఆదరపూరితమై కళకలలాడు నుదుట యెఱ్ఱని కుంకుమబొట్టు ధరించి, శేశ్వేరు వరుసగా అందరినీ స్వయంగా పలుకరించి భక్ష్యభోజనాదులు సరిగా అందుచున్నవో లేదో కనుగొనుచుండు దృశ్యములు తలచుకున్నప్పుడు 'అన్నపూర్ణ'యే సాక్షాత్కరించినట్లుగా ఉండేది.

విధవావివాహాలూ, వర్ణాంతరవివాహాలూ ఈమె ఆధిపత్యమున నెన్నో జరిగినవి సంఘము, న్యాయశాస నరీత్యా స్త్రీలయెడచూపిన అత్యాచారాలను ప్రతిఘ టిస్తూ సంస్కరణ మార్గాలను సూచిస్తూ ఉద్ఘాటిస్తూ ఉండెడిది. మచ్చుకు ఆమె 1933 లో గుంటూరు మండల సప్తవార్షిక మహిళామణులసభకు అధ్యక్షు రాలుగా చెప్పిన కొన్నిమాటలు వారిఅభిప్రాయాలను స్పష్టీకరించగలవు. "ప్రపంచపరిణామము దూరదృష్టితో చూచినకొలదీ సంఘనిర్మాణమునకు వివాహము యెట్లు అవసరమో, వివాహవిచ్ఛేదనకూడ అటులనే ధర్మముని తోచక మానదు. ఈవిషయమై వాదవివా దములు కలవని గుర్తెరిగియే నాఅభిప్రాయ మీయ సాహసించు చున్నాను. వివాహ విముక్తి విషయమై స్త్రీకి స్వతంత్రత కలిగిన, నీతిబాహ్యులగుటకు కారణమగునని అభి ప్రాయపడుట పొరబాటు. స్త్రీ తననీతిని కాపాడుకొనుట, కాపాడుకొన లేకుండుట, స్వభావమునుబట్టి గాని, అవకాశమును బట్టి మారు ననుకొనుట సరిఅయినది కాదు. వ్యాధిగ్రస్థయగునట్టియు, దాంపత్యమునకు తగినట్టియు, దుష్టురాలగు నట్టియు స్త్రీని పరిత్యజించి వివాహేచ్ఛ గల పురుషుడు ద్వితీయము చేసికొనుటకు అవకాశము కలిగినప్పుడు, అనర్హుడగు పురుషునే పట్టుకొని వుండమని స్త్రీని శాసించుట ధర్మవిరుద్ధము కాదా? అట్టిస్త్రీ బ్రతుకు, మరణమునకన్న అన్యాయమే అగును. అట్టిస్త్రీకి భర్తతో కాపుర మసంభవమైనప్పుడును, వివాహా కాంక్ష తీరనప్పుడును, వివాహావిముక్తి చేసి కొని, పరిణయమాడు స్వతంత్రము నిచ్చు శాసనముండుట అవసరము. వివాహ విచ్ఛే దన శాసనముండినంత మాత్రమున స్త్రీలు అవినీతిపరులగుదురనీ శాసనమును దుర్విని యోగముకావించెదరనీ తలపకుందురుగాక" అని రాజేశ్వరమ్మగారు నొక్కివక్కాణించియుండిరి.

దీనబాంధవి, సద్గుణఖని, ఇట్టి మహదాశయా లతో, నిరాడంబర జీవిగా, నిష్కలంక హృదయ ముతో, సర్వమానవ సమదృష్టితో స్వార్థమనేది ఏమిటో ఎరుగక, భాగ్యభోగ్యములకు దేశమునకు,

స్త్రీజాతికి, సంఘమునకూ అర్పించి, పుట్టింటికినీ మెట్టినింటికినీ కీర్తి తెచ్చుటయే గాక, జీవితపరమావధియైన మానవసేవామార్గమును ఆంధ్రావని యందలి మహిళామణులకు చూపి, నలుపదారు వత్సరాల నడివయస్సునందే అకాలమృత్యు వాతబడి, మహిళాలోకమునకు తీరని కొరత గలుగచేసిన మహిళామతల్లి, నాతోబుట్టువు- శ్రీతుర్లపాటి రాజరాజేశ్వరమ్మ గారికి జోహారు. ఈమె కీర్తి చిరస్థాయిగా ఆమె నెరిగిన వారి హృదయాలలో నాటబడియేయున్నది. అర్ధాంగియైన ఈమె ఎడబాటు వల్ల అరశరీరముతో కాలము గడుపుచున్న బారిష్టరుగారు కృష్ణానదీతీరమున నిర్మించిన సమాధియూ, 'రాజరాజేశ్వరి' సుభాస్ చంద్ర సుకుమార్ బాబు అనాధబాలాశ్రమము, మొదలైన సంస్థలునూ, రాజరాజేశ్వరమ్మ గారి సేవాఫలాలు గా, చిరస్థాయిగా విరాజిల్లుచూ ఆమె ఆత్మశాంతికి తోడ్పడుగాత.

# అంపకాలపాట

రావు సాహెబు బచ్చు పాపయ్యశ్రేష్ఠి గారు

పోయిరా మాయమ్మ - పోయిరావమ్మా
పోయి మీ యత్తింట - హాయిగా నుండ,

♦ ♦ ♦

శ్రీమహాలక్ష్మినీ - చెంతన నుండి
సకల సంపదలను - సమకూర్చుగాక,
శారదాసతి కటా - క్షంబున నీకు
చదువులు చక్కగా - సమకూరుగాక,
పతి కర్థమైయుండు - పార్వతీ దేవి -
ఆయు రారోగ్యంబు - లమరుచు గాక ॥పో॥

♦ ♦ ♦

వక్షస్థలంబందు - భార్య నుంచుకొని
కాపాడుకొను రమా - కాంతుని బోలె,
నాల్కలోపల తన - నాతి నుంచుకొని
యాజ్ఞనిర్వర్తించు - నల బ్రహ్మబోలె,
సగము దేహము నిచ్చి - సంతోష పెట్టి
సతిమాట దాటని - శంకరు పోలె,
నిన్ను నీ పతి సదా - నిశ్చలప్రేమ
అంకమం దిడుకొని, - యకలంక విధిని
చిన్నారి పల్కుల - చెక్కిలి నొక్కి,
మోము మోమున జేర్చి - ముద్దాడుగాక ॥పో॥

♦ ♦ ♦

మోటారుబండిలో - ముందు సీటునను
నీభర్త డ్రైవింగు - నేర్పుతో చేయ,
ప్రక్కన గూర్చుండి - మక్కువ మీర
చిలుక పల్కుల తోడ - చెల్లాటమాడి,
బీచిషికా ర్వేళ్ల - వేళలయందు,
క్లబ్బుల విహరించు - కాలంబులందు,
పాపింగునకు వెళ్లు - సమయంబులందు,
పిక్చర్సు లోపల - వివిధంబు లైన
శృంగారఘట్టము - ల్చెలువుండు జూపి
నర్మిలి నీతోడ - మర్మ వాక్యముల
సల్లాపముల నాడు - సందర్భమందు,
ఫస్టుక్లాసుబండిలో - పయనంబొనర్చి
కోరిక లీరంగ - దూర దేశముల
సర్వ సౌఖ్యంబులు - సమకూరుచుండ
రాజభోగంబులు - రంజిల్లుచుండ,
దర్శింపబోయెడు - తరుణంబులందు,
ఆనందవార్ధిలో - నలరారుచుండి
మమ్మెల్లరను నీవు - మరతువుగాక ; ॥పో॥

♦ ♦ ♦

ఒక వేళ నీవింట - నుండిన నాథు
పతివచ్చు వేళకు - పనులెల్ల తీర్చి
కోరిన రీతిగా - కురులను దువ్వి
సొగసు కీల్జడ వేసి - సుమములు బెట్టి
దిన మొక్క రీతిగా - తిలకంబు దిద్ది
కస్తూరి వాసనల్ - గ్రమ్మరింపంగ
మేలిరంగులచీర - మిసమిస ల్గొలుప
తనువెల్ల వజ్రకాం - తిని మెరయంగ
హారనుధ్వని చెవి - కందిన యపుడె
చేతిలో నిట్టింగు - చేతిలో నుంచి
బిరబిర పరుగెత్తి - వెలుపల కేగి
వెనుకకు కీల్జడ - వ్రేలాడు చుండ

ముఖమందు చిరునవ్వు - ముద్దులు గుల్క
వాల్గన్ను లతని నా - హ్వానం బొనర్ప
వాకిలిప్రక్కకు - వచ్చి నిల్చుకొని
పతితోడ నింటిలో - పలి కేగవలయు ॥పో॥

◆ ◆ ◆

ఇంటిలో పనివార - లెంతమందున్న,
పతికి గావలసిన పనుల నన్నిటిని
సరసిజాక్షిరో నీవె - సవరింపవలయు ,
స్నానాది భోజన - సమయంబులందు
ముందలనే యుండి - అందియ్యవలయు ;
భోజనానంతర - మున ప్రక్క జేరి
పచ్చకర్పూరంపు - పరిమళం బొప్పు
తాంబూల మిచ్చుచో - తమలపాకులను
మడిచి నాథునిచేత - నిడరాదు సుమ్మి ;
తానుబట్టిన చేయి - తప్పించి వైచి
విడియంబు నోటనే - పెట్టంగవలయు ;
భర్త ఆఫీసుకు - పయనమై నపుడు
ఉడుపుల నందిచ్చి - యుల్లాస మొప్ప
అతనికి వలసిన - యవియెల్ల గూర్చి
పతితోడ వాకిటి — వరకును వెళ్లి
"మరల శీఘ్రంబె వ - త్తురుగదా" యనుచు
అతడు మోటార్ బండి - యందెక్కుదనుక
ఆహ్లాదముగ సాగ - నంపంగవలయు ॥పో॥

◆ ◆ ◆

అత్తమామల మాట - యందెల్లయపుడు ;
కడుప్రేమ చెలువార - గౌరవం బొప్ప
దైవంబులని మదిజ - దలపోసికొనుచు
వారిచ్చు నాజ్ఞల - పాలించుకొనుచు
వారికి ప్రీతిగా - పనులెల్ల జరిపి
వారి కిష్టములేని - పనులను మాని
గృహభార మవ్వారి - కేమియు లేక
సంసారమును నీవె - జరుపంగవలయు ;
మరదండ్ల వదినెల - మర్యాద జూచి
తోడికోడండ్రు సం - తోషంబు బొంద
బంధువు లానంద - పడు నట్లుగాగ
పతిగౌరవంబు గా - పాడంగ వలయు ;
చనువీయకుండనే - పనివాండ్ర నెల్ల
ప్రీతి బిడ్డలబోలె - వీక్షింపవలయు ;
దేవపూజలను భ - క్తిని నిర్వహించి,
వివిధ సౌభాగ్యము - ల్విలసిల్లుచుండ,
పుట్టిన యింటికి - మెట్టినింటికిని
సత్కీర్తి మెండుగా - సమకూర్పవలయు ,
పోయిరా మాయమ్మ - పోయిరావమ్మ
పోయి మీ యత్తింట - హాయిగా నుండు.





ఓం. వందేమాతరం.

# శ్రీకేసరివారి కీర్తిలతకు మాపద్యనీరాజనము

తెలుఁగుజగానఁ బుట్టితివి, తెల్గుసహోదరికోటి నెంతయున్
వెలుగునదెచ్చు కన్నియల విద్దెల శాలను రెండుచేతులన్
గలుపుచు స్థాయిజేతువిఁకఁ గాలము దిద్దకమున్నె తెల్గులోఁ
దొలుతటి యున్నతాలయము దోఁపగ జేసితివన్న ! కేసరీ !

శ్రీసరిదూఁగు నీదుకుడిచేయి సుధారసధారజార్చి, లో
ధ్రాసవదివ్యయోగమున నన్నులజాతికి సౌఖ్యభాగ్య సం
తోషము లిచ్చుచున్నయది; దొడ్డది నీవిడుత్యాగధార పే
ర్వాసిని జాఁటుచుండుగద ! భ్రాత ! నమస్తే ! యశస్వి ! కేసరీ !

తెలుఁగువారి యింటింటను వెలయుచుండు
నీదు "గృహలక్ష్మి" మహిళల నీతివంట !
సాగనిమ్మయ్య సోదరీ సత్క్రియలను !
ఆర్య ! మాదగు ననుఁగు జోహార్లు నీకు !

ఇంతటిమేలు మాకునొనరించుచు నున్నవదాన్య ! నీకు మే
మెంతొ ఋణాన మున్గి, భవదీయయశః ప్రసవాలి ఆంధ్రసీ
మాంతములందుఁదావులిడ హారతిపాడుచునుందు మార్య ధీ
మంతుఁడ ! అల్లదే జనని మైకొనిచల్లెను మంగళాక్షతల్ !

డబీర్ రామరత్నము
ఫురటి రోహిణిదేవి




# సంభాషణ—'అతిధోరణి'

శ్రీమతి సత్తిరాజు సూర్యకాంతమ్మగారు

సంఘజీవితంలో-ముఖ్యంగా పట్టణాలలో పలువిధాల వృత్తులవలంబించి జీవనంగడుపుతూ ఉండటంవల్ల రకరకాల అభిరుచులూ, వేర్వేరు దృక్పథాలూగల వ్యక్తులతో ఎప్పుడో ఒకప్పుడైనా పరిచయం సంభవించటం తప్పదు ఎవరితోనూ మాట్లాడకుండా నోరుమూసుకుని కూర్చుందాం అని నిర్ధారణ చేసుకున్నా అటువంటిది సామాజికజీవితంలో ఎంతమాత్రం కుదరదు. తెల్లవారిలేచినదిమొదలు ఏకూరగాయలు విక్రయించేమనిషితోనో, ఏ కళాయిపూతలవానితోనో, మగవాళ్లు భోజనాలు చేసి ఆఫీసులకు వెళ్లిన తర్వాత తీరికచేసుకుని, పిచ్చాపాటీ ముచ్చట్లకు వచ్చే ఇరుగుపొరుగు అమ్మలక్కలతోనో సంభాషించటం ఇల్లాండ్రకు అనుభవంలోనిదే.

మనస్సు, వాక్కు, కర్మలనే మూడింటితో మానవజీవితమూ, తన్మూలంగా యావత్తు బాహ్యప్రపంచమూ సాగిపోతూఉంది. మహాసంగ్రామాలు వచ్చేందుకైనా, నిశ్చలమైన శాంతి ప్రబలేందుకైనా ఈ మనోవాక్కర్మలనే త్రికరణాలే కారణభూతాలు. నేటి మానవసంఘాలలో, త్రికరణశుద్ధి, ప్రజాబాహుళ్యంలో లేకపోవటమే మనం కళ్లారా, మనదేశంలోనేకాదు, ప్రపంచమంతటనూ చూస్తూ అనుభవిస్తూఉన్న దుర్భర దురంత సంఘటనలకు కారణం. ఆలోచించేది ఒకటి చెప్పేది మరొకటి తుదకు చేసేది వేరొకటి అయినప్పుడు, ఇటువంటి ప్రమాదాలు రాక తప్పుతుందా?

త్రికరణాలలో ముఖ్యమైనదిన్నీ, అఖండ శక్తికల్గినది-వాక్కు. సేనాధిపతి సంగ్రామసమయంలో పొరపాటునైనా తప్పుఆజ్ఞ సేనలకు ఇవ్వటంవల్ల ఒకప్పుడు జయాపజయాలు తారుమారుకావచ్చును. దేశనాయకులుగాని, మతనాయకులుగాని దుష్ప్రచారంచేస్తే దేశమతాలకు ఎంతముప్పు వస్తుందో వేరే చెప్పాలా. త్రికరణశుద్ధిగల గాంధిమహాత్ముని నోటినుంచి ఆయన సందేశాలు వినడానికి లక్షలాది ప్రజలు ప్రార్థన సమావేశాలకు ఏవిధంగా, తేనెటీగలు తేనెపట్టుచుట్టూ మూగినట్లు, హాజరయ్యేవారో మనకు తెలిసేఉంది.

"మాటకు ప్రాణము సత్యము" అనిన్నీ "నోరే రసభరితమైన నుడువులకెల్లన్" ఆధారమనీ, సుమతి శతకంలోని పద్యాలు మనపిల్లలు చదువుతారుగదూ? మాటలే మహామంత్రాలు. మాటలతో మహాత్ముడు, "శిలాహృదయాలను కరిగించగలం," అని నిరూపించారు. మాటలకు అంతశక్తిఉంది కవిత్వం, చిత్రలేఖనం, సంగీతం మొదలైన లలితకళలవంటిదే సంభాషణకూడా. సంభాషణలో మాధుర్యం, చాతుర్యం, సమయస్ఫూర్తి, హాస్యం, సభ్యత్వం, హావభావప్రదర్శన, ఎదటివారిమనసులో సంభాషణకాలమందు చెలరేగే భావాలను అవగాహనచేసుకునే నిపుణత మొదలైనవి అనేకం కలిసిఉండాలి. తక్కినే లలితకళలమాదిరిగానే కొంత పూర్వజన్మసువాసన కూడాఉంటే అభ్యాసంవల్ల సంభాషణ-శక్తి వృద్ధిపొంది బాగారాణిస్తుంది.

సంభాషణయందలి ఔన్నత్యం, శక్తి నిరూపించటానికి ఎనిమిదవ ఎడ్వర్డుయొక్క ప్రణయగాథయే ప్రబల నిదర్శనం. ఆయనను ఆకర్షించి, ముగ్ధుణ్ణిచేసి, సామ్రాజ్య పట్టాభిషేకాన్నికూడా తృణీకరింపచేసినది తన ప్రేయసియొక్క అందచందాలుకావు, ఆమెయొక్క సంభాషణశక్తి మాత్రమే.

"నేను ఆమెనే వివాహంచేసుకుని, ఆమె సరస సంభాషణామృతంతో జీవయాత్ర సాగిస్తానేకాని, ఆమెను పెండ్లాడకుండా, మహా సామ్రాజ్య చక్రవర్తిగా, ఉండటానికి ఎంతమాత్రం అంగీకరించను" అని పట్టుపట్టి తుదకు సింహాసనాన్ని త్యజించి, తన ప్రేయసినే వివాహంచేసుకున్నాడు ఎనిమిదవ ఎడ్వర్డు.

మితభాషులతో సంభాషణ ఒకవిధంగా కష్టం అయితే, అతిధోరణిగలవారితో సంభాషించటం మరొకవిధంగా కష్టంగాఉంటుంది. 'అవును' 'నిజమే' 'కాదు' 'అలాగే' అంటూ ఒక్కమాటతో సంభాషణలో సమాధానం ఇస్తూఉన్న మితభాషులతో మాట్లాడటం, చెప్పేది పూర్తిగా చెప్పనీయకుండానే చెప్పేవారిమాటలు వారినోట్లోఉండగానే మధ్యఅందుకుని అతిధోరణిగామాట్లాడే వాళ్లతో సంభాషణ నిరర్థకంగా ఉండితీరుతుంది. సాధారణంగా కొంచెం హూణవిద్యనేర్చి, మిడిమిడిజ్ఞానం సంపాదించినస్త్రీలు కాలేజీలలోజేరి ఆంగ్లవిద్యను అభ్యసించనిస్త్రీలతోనూ, పాతకాలంనాటిస్త్రీలతోనూ, ముచ్చటించటం సందర్భపడినప్పుడూ, పెద్దఉద్యోగస్థులపడతులు తమభర్తల డిపార్టుమెంట్లలోని తక్కువజీతగాళ్ల భార్యలతో సంభాషించునప్పుడూ, ధనాతిశయులునూ, ఐశ్వర్యాతిశయులునూ, అయి అహంభావముతో ప్రవర్తించు అతివలు, తక్కువస్థాయిగలస్త్రీలతో ప్రసంగించునప్పుడునూ, ఈ రెండువిధాలైన మితభాషణ, అతిభాషణలలో ఏదో ఒకదానిని అవలంబించటం, ఆవిధమైనధోరణిలో సంభాషణ జరపటం చూస్తూఉంటాం. విద్యనేర్చినా విజ్ఞానంలేకపోవటంవల్ల ఇటువంటి అసందర్భాలు కలుగుతాయి.

తమ ఘనత ఎదటివారికి తెలియచేయటంతో ఒకవిధమైన ఆత్మసంతృప్తిపొందటం వారిఅభిమతం అతిధోరణిలో తమయొక్కగొప్ప పదేపదే చెప్పుకోవటం ఎంతసేపూ తమపుట్టుపూర్వోత్తరాలనుగురించి ప్రసంగించటం, తమఔన్నత్యం తమనోటితోటే ప్రస్తావించుకోవటం, ఇతరవిషయాలనుగాని ఎదుటిస్త్రీ చెప్పబోయినమాటలైనా వినటానికి తావివ్వకుండా గంటలతరబడి స్వంతబాకా ఊదుకోవటం జరుగుతుంది. అనేక అప్రశస్తమైనవీ, ఒకదానికొకటి సంబంధించనివి విషయాలు జతకూర్చబడి అతుకుల బొంతగా తయారవుతుంది సంభాషణ.

"వినదగు నెవ్వరుచెప్పిన" అనే శతక వాక్యాన్ననుసరించి, అతిధోరణిని విసుకులేకుండా సహించే మర్యాదస్థులైన స్త్రీలతో సంభాషించేటప్పుడుకూడా అమ్మలక్కలు కొందరు ఎందుకూపొందని ఊళ్లో సంగతులన్నీ ఏకరవుపెడుతూ పెత్తనాలకువచ్చి సంభాషించటంకూడా మనలోచాలామందికి అనుభవములోనిదే. సర్వసామాన్యంగా ఇటువంటి అతిధోరణిస్వభావంగలస్త్రీలు మాయమర్మాలుఎరుగని సహృదయులే అయిఉంటారు. వసపోసినపిట్టలాగున గ్రుక్కతిప్పుకోకుండా మంచీ చెడ్డా మాట్లాడేవాళ్లలో కొందరు వినేవాళ్లకు విసుకుపుట్టకుండా హాస్యధోరణిలో ప్రసంగించగల్గినవాళ్లనుకూడా నేనెరుగుదును.

అతిధోరణిలో, చాదస్తంగా చెప్పిందే చెప్పుతూఉండటం సామాన్యంగా కలుగుతుంది. అతిధోరణిలో ప్రమాదంకూడా కలగడానికి అవకాశంఉంది. వరదరోజుల్లో కృష్ణా, గోదావరినదుల ప్రవాహంలాగున చెత్తా చెదారం, ఆధోరణిలోప్రవహిస్తాయి. వాళ్లమీదా వీళ్లమీదా ఉన్నవీ, లేనివీ కల్పించిచెప్పటం తటస్థిస్తుంది. గోడలకుచెవులుండి, 'ఈ' ఊబుసుపోక తీరుబడిగా అమ్మలక్కలుచెప్పుకొనేమాటలు బైటికి పొక్కడం, దానిమీదట లేనిపోనివైషమ్యాలు సంభవించొచ్చు. ఇట్టిప్రమాదాలు సరిపడనిగోష్ఠివల్లకూడా కల్గుతాయి. కాని సావధానంగా వచ్చికూర్చుని పొద్దుపోక ఇష్టాగోష్ఠిసలిపే ఇరుగుపొరుగమ్మలలో

అతిధోరణిగలవారివల్ల ఎక్కువగాకల్గటానికి అవకాశంఉంటుంది. "చూడండి, సుందరమ్మగారూ! మొన్న విన్నారోలేదో ఏదో ఆఫీసరుగారట-వాళ్లఅమ్మాయి చదువుకుంటోందిట కూడాను-శూద్రుణ్ణికట్టిట, పెళ్లాం పిల్లలూ ఉన్నారుటకూడా-పెళ్లాడిందిట. పేపర్లోపడిందిటకూడా, ఏం విడ్డూరమమ్మా? ఇల్లా పేట్రేగి పోయారు ఇప్పటిపిల్లలు, శివ, శివా," ఈవిధంగా లోకాభిరామాయణం, దానికి చిలవలూ పలవలూ అల్లటం. వృధాకాలక్షేపం చేయకపోతే ఏభారత భాగవతాలో చదువుకుంటూ అర్ధంచెప్పుకుంటూ తీరిక సమయాలు ఉపయోగించుకోరాదా? లేకపోతే ఏ వార్తా పత్రికోచదువుతూ వివిధాలగు, ప్రపంచ విషయాలు తెలుసుకోరాదా?

ఈసారి అతిధోరణితో హతమారుస్తున్న పొరుగింటి పంకజాక్షి పేత్తనానికివచ్చినప్పుడు ఏగ్రంధమో, ఏవార్తాపత్రికో తీసి ఆవిడమాటలు వినిపించుకునీ వినబడనట్లు, మీరుచదివి విశేషాలుచెప్పటం ప్రారంభించి, ఆవిడధోరణికి అవకాశంఇవ్వకుండా ప్రయత్నించి చూడండి - ఎటువంటిమార్పుకలుగుతుందో? మీ బుద్ధికుశలత, వివేకం ఉపయోగించి రెండుమూడుసార్లువరుసగా ఆవిధంగాచేస్తే ఎటువంటి ఫలితంకల్గుతుందో మీకేతెలుస్తుంది. వృధాకాలక్షేపం, పిచ్చాపాటివదలి సద్గోష్టిగామారి ఆయాసమయాలకు పంకజాక్షే కాకుండా ఆమెతో ఇంకానల్గుర్ని వెంటబెట్టుకొచ్చి వారందరూకూడా విజ్ఞానాన్నిపెంపొందించే గోష్ఠిలో పాల్గొనగల్గుతారు సంభాషణకూడా చదువుతూ వింటూఉన్నవిషయాలకే ప్రత్యేకించబడి, అనవసరధోరణికి అవకాశంలేకుండానూ పోతుంది. అతిధోరణివల్లకలిగే అనర్థాలూ తప్పుతాయి. అతిధోరణి మనస్త్రీలలోనే ఎక్కువగా ప్రబలి ఉందని నా అనుమానం

'సంభాషణ' ను సంఘజీవనానికి ముఖ్యమైన 'లలితకళ' గా ఆమోదించి మనము ప్రత్యేకశిక్షణతో సంభాషణవిధానాన్ని అవలంబించటమేకాకుండా మనపిల్లలకుగూడా నేర్పించటానికి కృషిచేయాలి. లలిత కళలు, పురుషులకంటె స్త్రీలు, త్వరితంగానూ సులువుగానూ నేర్చుకోగల్గి, అసమానమైన ప్రజ్ఞావతులు కాగలరని జ్ఞాపకం ఉంచుకుని, వాటిని విరివిగా అవలంబించటం అవశ్యకర్తవ్యం.

A I R. అనుమతిని



# కోడండ్రికం

పాసిపోయిన కూడు బలవంతముగ బెట్టి
బాధించు చుండెడి పాపి యొకతె
ఇంటెడి చాకిరి విధిలేక జేసినా
రట్టు జేసెడునట్టి రక్కసి యొకతె
కట్టబట్టలు గొనక ఘాటుగా తిట్టుచు
కోడళ్ల వేధించు కుటిల యొకతె
ఉన్నవి లేనివి నోర్పుతో సమకూర్చి
కొడుకుతో జెప్పెడి కుమతి యొకతె

అత్త యొకయింటి కోడళ్ళ అనెడి సూక్తి
మరచినారేమొ ? మహిళాప్రపంచమునకు
దీరరానట్టి దుష్కీర్తి తెచ్చినారు!
ఆదరించుడి కోడళ్ల నాదరమున.

సర్వకాలములందు సాధించు చుండియు
అష్టకష్టము లెట్టు అత్త యొకతె
ఆడబడుచుల కెల్ల అరవ చాకిరి చేయు
కోడళ్ల బాధించు కుమతి యొకతె
చక్కని బట్టల సంతోషముగ గట్ట
నిప్పులఁ గ్రాల్చెడు నింతి యొకతె
తనవార లొచ్చిన చనవుగా మాట్లాడ
నతి శ్రద్ధతో విను నాతి యొకతె

ఇన్ని విధముల బాధల నిడుట వలన
మానసంబున బెంగతో క్రుగ్గిక్రుగ్గి
తుదకు నూతికో గోతికో దూక జూచి
పరుగు లెత్తుచు నుందురు పడుచు లవని.

కుమారి రోహిణి.

# అభిమానము

(శ్రీమతి భావరాజు రాజ్యలక్ష్మిగారు - సాహిత్య విశారద)

అయ్యది సంధ్యాసమయము. సంధ్యారాగ మెల్లెడల నలముకొనుచు చూపరుల కొక వింతహాయి నొసంగుచుండెను.

అలహాబాదునగరము-'యమునావిహార్' భవనము, వెనుకవైపు వసారాపై రెండుటేబులున్ను కుర్చీలు అమర్చబడి యున్నవి. సోఫా కుర్చీలలో సుఖాసీనులై నలుగురు స్నేహితు లిష్టాగోష్ఠి సల్పుచుండిరి. అందులో నొకడు భవనపు యజమాని. అతనిపేరు శ్యామకిశోర్. వయస్సు ముప్పదిలోపు. ధనికుడు. తల్లిదండ్రు లిర్వురు కాలధర్మము నొందుటచే పెత్తన మాతనిచేతిలోనికి వచ్చెను. స్వతహా శ్యామకిశోర్ ఉత్తముడేను. కాని కొంతకాలము నుండీ దుర్జనసహావాస మాతని చెడుమార్గమున కీడ్చుచుండెను. శ్యామకిశోర్ లోనికి జూచుచు "రఘునందన్" అని పిలిచెను.

'అయ్యా, వచ్చితి. ఏమి సెలవు' అనుచు ఆవృద్ధనౌఖరు ఎదుట నిలిచెను. అతడీయింటి చిరకాలపు నౌకరు. శ్యామకిశోర్ పాడై పోవుచున్నాడని విలపించుచుండెను.

శ్యా:—రఘునందన్. విస్కీ బాటిల్ తే. వేగం తేవాలి.

ర:—చిత్తం (చేయునది లేక రఘునందనుడు విస్కీ బాటిల్ బల్లపై నుంచెను.)

శ్యామకిశోరు ననుమతిపై స్నేహబృందము నల్వురు దానిని కప్పులలో పోసికొని మధుసేవ జేసిరి. తృప్తిజెందక స్నేహితుల కోరికపైని "బ్లాక్ అండ్ వైట్" అను మేలైన మధువును శ్యామకిశోర్ ఆజ్ఞాపించెను. రఘునందన్ మాటాడలేక నయ్యదియు తెచ్చి వారి ముందరనిడెను.

మధుసేవ గావించిన పిదప నొక స్నేహితు డిట్లనెను:

ఆహా! శ్యామకిశోర్, ఏమిహాయిగానున్నది. ఈసమయమున మన యమునాబాయి నాట్యముండిన నెంత బాగుండును? అంత.

శ్యా:—రఘునందన్! ఊఁ.

ర:—అయ్యా, ఇంక ఈ పని మాత్రము నా వలన గాదు. నౌకరీ మానుకొని పొమ్మన్న పోయెదను.

స్నేహితులు:—ఏమి? నౌకరీయే, మానుకొనెదవా' ఏమిపొగరుపిడికి? నౌకరీ ఊరికే వస్తుం దనుకొన్నావా యేం?

శ్యామకిశోరు వైపు తిరిగి నమస్కారమొనర్చి రఘునందను డాచీకటిలో నెట్లో వెడలి పోయెను. కొన్ని నెలలు గతించినవి. పరిస్థితులు తారుమారయినవి. శ్యామకిశోర్ యమునాబాయి చేతిలో ఒక కీలుబొమ్మగా మారిపోయి మధుసేవ వలన స్నేహితుల దయవలన ఉన్నదంతయు (భవనముతోసహా)

గోల్పోయెను. ఇక నట నిలువనీడ లేని వాడయ్యెను. భార్యాబిడ్డలను వెంటనిడుకుని గ్రామము విడిచి పోదలచెను.

♦ ♦ ♦

ఢిల్లీనగరం మెయిన్ బజారులో నొకస్థలమందు 'సిల్కు-క్లాత్ స్టోర్సు, మేనేజరు-రఘునందనబాబు' అని బోర్డు వున్నది. వీధివీధులు తిరుగుతూ ఉన్న ఒకవ్యక్తి ఈ బోర్డు చదువుతూ అట్టే నిలబడి పోయెను. ఇంతలో ఒక ఘూర్కా-నౌకరు వచ్చి ఇట్లు ప్రశ్నించెను.

ఏమి ? లోనికి దయచేయుదురా ?

వ్యక్తి:—ఈషాపు యజమాని యెవరు ? ఎక్కడ వుంటారు ? ఎంతకాలం అయింది ఈ షాపుస్థాపించి ?

నౌకరు:—రఘునందన్ బాబు యజమాని. యిక్కడనే లోపల బసచేసి యున్నారు. 6 మాసముల క్రితము ఈ షాపు పెట్టియున్నారు. చాలా మంచిబాబు. మీ రెవరు ?

వ్యక్తి:—(గ్రహించి) నేను మీ యజమానికి తెలిసిన వాడను. నన్ను లోనికి గొని పోగలవా ?

నౌకరు:—తప్పక.

లోనికి వచ్చిన వ్యక్తిని చూడగనే రఘునందన్ వెంటనే తనకుర్చీనుండి లేచి, 'శ్యామకిశోర్ బాబు, దయచేయండి. తమరేల ఇట్లుంటిరి ? ఇచ్చటకు వచ్చుట ఎట్లు సంభవించెను ?' అని కంట నీళ్లు పెట్టెను.

శ్యా:—రఘునందన్ ! (విచారముతో కొంచమాగి) నీ వంతయు గ్రహించియే యుందువు, నేను నిన్ను తిరస్కరించి తొలగించి సమస్తము గోల్పోయితిని. నన్ను క్షమింపుము.

ర:—దానికేమి బాబూ-అది గ్రహస్థితి. మీరేమి చేయగలరు. అయినప్పటికి మీకు ఏమీ ఫరవాలేదు, మీరు నాయింట సుఖముగా నుండ వచ్చును. నేను ఎప్పటి వలె మీ దాసుడను. అమ్మగారు పిల్లలు యెక్కడ ? క్షేమమా ?

శ్యా:—రఘునందన్ ! నీ వెంత యోగ్యుడవు. అమ్మగారు పిల్లలు కూడ నా వెంటనే వచ్చిరి. ప్రక్కనే హోటలులో గదిలో బస చేసితిమి. వారలను నీరక్షణ క్రింద వదలి వెళ్లుచున్నాను. ఈ ఉపకారము చేసిన జాలును. నాకు నీయందు సంపూర్ణ విశ్వాసము గలదు. ఎప్పటికైనా నా రోజులు తిన్నబడుచో తిరిగి వారలను తీసికొని వెళ్లుదును. ఈ భారము నీపై మోపినందుకు క్షమించు. ఈ నీ కృతజ్ఞతయొక్క ఋణము ఎప్పటికైనను తీర్చుకుందును.

ర:— కిశోర్ బాబూ ! మీ నాయనగారిచ్చిన 1500 రూపాయలు జాగ్రత్తతో దాచుకుని యీ షాపు పెట్టుకున్నాను. మీ దయవలన నాకు నెలకు 400 రూపాయలు వరకు లాభము వచ్చుచున్నది. నాకియ్యది ఏమీ భారము లేదు.

ఈ మాటలు వింటూనే శ్యామకిశోర్ నిల్వలేక త్వరత్వరగా వెడలిపోయెను. రఘునందనుడు చకితుడాయెను. శ్యామకిశోరు భార్యాపిల్లలను తనయింట బసచేయించి అతిజాగరూకతతో చూచుచుండెను.

మరి కొన్ని నెలలు గడచినవి. ఒక రోజున రఘునందనుడు మామూలుగా తనషాపులో పని చూచుకొను చుండెను. ఇంతలో చేత నొక కవరు నుంచుకొని ఒక జవాను 'మేనేజరుగారు రఘునందన్ తమరేనా' అని ప్రశ్నించెను.

ర:—అవును నేనే.

జ:—ఇదిగోనండి: వుత్తరము.

రఘునందనుడు కవరు చించెను. రు 2000-0-0 లకు బ్యాంకుచెక్కు మడిచి వుంచి శ్యామకిశోరు వ్రాసిన వుత్తరము చదివెను.

"ప్రియ రఘునందన్,

దైవకృప వలన నారోజులు మారినవి. నాకు గొప్ప ఉద్యోగము దొరికినది. ఈ చెక్కు మార్చి సొమ్ము తీసికొనుము. ఒక వెయ్యి రూప్యములు నాభార్యాపిల్లల ఖర్చుకుగాను, మరియొక వెయ్యిరూపాయలు నీకు బహుమానముక్రింద పంపితిని. తిరస్కరించక గైకొనుము. ఈ జవానుద్వారా నా భార్యను పిల్లలను దయచేసి పంపుము.

ఇట్లు,

నీ కిశోర్ బాబు.

రఘునందను డొక నిట్టూర్పు విడిచెను. చేతినుండి కవరు చెక్కు క్రిందబడెను.

వచ్చిన నౌకరాతని యనుమతిపై శ్యామకిశోరుని భార్యాపిల్లలను వెంటనిడుకొని బొంబాయి చేరెను.

(హిందీ కథ ననుసరించి)

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. ఎన్. కేసరి.

శ్రీ ఆదిశంకరాచార్యులవారు కేరళదేశవాసులు అనియు, నంబూదిరీ బ్రాహ్మణులు అనియు నవంబరు మాసపు "గృహలక్ష్మి" సంచికయందు వ్రాసియున్నాను. కేరళదేశమన నేమి? నంబూదిరీ బ్రాహ్మణులెవరు? - అనువిషయములను ఇప్పుడిక్కడ వ్రాయుదును.

పరశురాముడు క్షత్రియులనందరిని వెతకి వెతకి సంహరించిన అనంతరం ఆపాప పరిహారార్థము బ్రాహ్మణులకు భూదాన మొనర్పవలయునని యోచించెనట. ఈధర్మ బుద్ధితో పరశురాముడు పశ్చిమసముద్రతీరమున నుండు ఒక పర్వతాగ్రమునుండి తన దివ్యాయుధమగు గండ్రగొడ్డలిని విసరి సముద్రమధ్యమున వేయగా ఆజలములలోనుండి కొండలు, గుట్టలు, చెట్లు చేమలు, నదులు, దొరువులు, పాములు, మృగములు మున్నగు వానితోగూడ భూమిపెల్లగిల్లి పైకుబికినది. ఆవిధముగా గొడ్డలి దెబ్బకు పాతాళలోకము నుండి ప్రతిధ్వనిచేయుచు పైకుబికిన భూభాగమే కేరళదేశము.

ఇట్లు బయలుపడిన నిర్జనప్రదేశమగు అరణ్యప్రాంతమును బ్రాహ్మణులకు దానమిచ్చు సంకల్పముతో పరశురాముడు ఆర్యావర్తమునుండి కొందరు బ్రాహ్మణులను రావించి వారికట్లే దానిని దానమొనర్చెను. అయితే ఆ వచ్చినబ్రాహ్మణులు అక్కడ నుండు క్రూరమృగములకు, ఘోరసర్పములకు ఝడిసి సమీపస్థమైయున్న కొంకణమునకు పారిపోయిరట. వారే నేడు సారస్వతబ్రాహ్మణులు అని పిలువబడు అందమైనజాతి.

పరశురాముడు రెండవసారి భక్తాగ్రేసరులు, పండితులు, మంత్రశాస్త్రవేత్తలునైన బ్రాహ్మణులను ఆర్యావర్తమునుండే తిరిగి రావించి వారికాభూమిని దానమొసగెను. రెండవసారివచ్చిన బ్రాహ్మణులు తపస్సంపన్నులు, మంత్రవేత్తలుగావున మృగసర్పబాధలకు జంకక వానిని వశమొనర్చుకొని అక్కడనే స్థిరవాసమేర్పరచుకొనిరి. ఇట్లు రెండవసారి వచ్చినవారే నంబూదిరీ బ్రాహ్మణులు.

ఈగాధలు సామాన్యముగా కేరళమున చెప్పుకొనబడుచుండునవి. ఐతే కేవలము ఇవి నిరాధారమగు పుక్కిటిపురాణములుగావు. మళయాళదేశమందలి ఇతిహాసములును కొన్ని ఈకథలనే మార్చిచెప్పుచున్నవి.

కేరళోత్పత్తి, కేరళ మహాత్మ్యము అను రెండు ఉద్గ్రంథములలోను నంబూదిరీలు, పరశురాముడు ఆర్యావర్తమునందలి పలుతావులనుండి తీసుకొనివచ్చిన బ్రాహ్మణులు-అని చెప్పబడియున్నది. ఆయన వీరిని 64 గ్రామములలో నిల్పెనట.

కొంకణ బ్రాహ్మణులుకూడా ఆర్యావర్తమునుండి పరశురాముడు పిలుచుకొని రాగా వచ్చినవారు అని స్కాందపురాణమున సహ్యాద్రికాండయందు చెప్పబడియున్నది. ఈకొంకణదేశముకూడ పరశురాముడు సముద్రమునుండి యుద్ధరించిన సప్తరాష్ట్రములలో నొక్కటియట.

నంబూదిరీ బ్రాహ్మణుల నివాసమగు ఆ క్రొత్తదేశమును పరశురాముడుద్ధరించెను గావున 'పరశురామక్షేత్రము' అందురు. కొండప్రదేశమగుట 'మళయాళము' అంటారు, నారికేళముల యుత్పత్తివిస్తారమగుటచే - 'కేరళము' - అందురు. భూమి పుట్టగానే తొలుతగా కొనిరాబడిన అగ్రజాతి ఆర్యులు నాగరికమొనర్చిన దేశము కావునను, ఆ ఆర్యులు ఆ కాలమునుండియు, వైదికకాలసాంప్రదాయము ననుసరించి యజ్ఞయాగాదిక్రతువులు, షోడశకర్మలు ప్రధానముగాతలంచి నిర్వహించు కర్మిష్ఠులగుట చేతను "కర్మభూమి" అనియు అందురు. ఇక నీఅగ్రజాతులగు నంబూదిరీ బ్రాహ్మణుల ఆచారవ్యవహారములగూర్చి వివరింతును.

వీరు వేదవేదాంగవేత్తలు; మహాకర్మిష్ఠులు, మంత్రశాస్త్రనిధులు, శిష్టాచార సంపన్నులు. ఆ వైదికాచారకర్మపరాయణులై వీరు సామాన్యముగా ఇల్లువదలిపైకిరారు. ఇతర కులములస్పర్శ వీరికేమాత్రము పనికిరాదు. పూర్వము వీరిలో ఉద్యోగములకు వచ్చువారులేరు. ఇప్పుడిప్పుడు వీరును ఇంగ్లీషు చదువులుచదివి ఉద్యోగములకు వచ్చుచున్నారు.

వీరట్టి యోగ్యులుకావున వీరికి "నంబూదిరీలు" అనే పేరువచ్చినది. "నంబుక" అనగా విశ్వాసము. దానినే మనము తెనుగున "నమ్మిక" అందుము. అట్లు విశ్వసింప దగినవారుగాన వీరు "నంబూదిరీలు"అని పిలువబడినారు. "తిరి" అనేది గౌరవవాచకము. బహుశా "శ్రీ" యే "తిరు" "తిరి" అయినదేమో!

వీరు మొట్టమొదట అరణ్యప్రదేశమున నాగుపాముల బాధకు తాళవలసివచ్చెను. అయితే వారు పండితులగుటచేత, మంత్ర తంత్ర ఆరాధనలచే నాగులను స్వాధీన మొనర్చుకొనిరి. నేటికిని అక్కడ నాగపూజ విస్తారము. ఆ నాగభక్తి చిహ్నమే-వారు-నాగుపాము పడగవలె జుట్టుముడి నడినెత్తిన ముడిచి ముందుకు విడుచుట.

వీరు ఆ దేశమునకు వచ్చిన తొలిరోజులలో అక్కడ ఇండ్లుగాని ఇతరవసతులు గాని లేవు. ఇటుకవగ్గిరా లింకను ఏర్పడలేదు. అందుచేత నా తొల్లింట నివాసులు అడవి కొట్టి కలపతో చిన్నయిండ్లు కట్టుకొనేవారు. నేటికి ఆ ఆచారముపోకుండ కేవలము కలపతోనే నిరాడంబరమగు కుటీరములను గ్రామాదులలో నిర్మించుకొని ప్రకృతిశోభ ననుభవించుచు నీనంబూదిరీ బ్రాహ్మణులు నివసించుచున్నారు.

వీరు తొలుదొల్తగా నీభూమికి వచ్చినప్పుడు ఇది నిర్జనప్రదేశమగుట ఆర్యుల నాగరికత ననుసరించి వీలైనంత భూమి నాక్రమించి, సస్యములు, వృక్షజాతములు వృద్ధి చేసుకొనుచు అనుభవించిరి ఆ భూములు వారి స్వంతమైనవి. నమ్మికకలవారగుట, ఆచారసంపన్నులగుట, బ్రాహ్మణులగుట, పిదప రాజులు భక్తిపూర్వకముగ విస్తారము భూములను వీరికి దానమొసంగిరి. ఇట్టి భూముల ననుభవించు వీరిని "జన్మిలు" అందురు — అనగా జమీందారులు (భూస్వాములు) అని అర్థము. ఈ విధముగా నేటికిని సగమునకుపైగా కేరళమున భూమి జన్మిలగు నీనంబూదిరీల ఆధీనముననున్నది. వాని ననుభవించుచు వారు పూర్వాచార పరాయణులై హాయిగ బ్రతుకుచున్నారు.

నంబూదిరీల ఆచారవ్యవహారములు

నంబూదిరీలు ఋగ్వేదకాలమునాటి ఆర్యుల కర్మధర్మముల నాచరించు శిష్టాచార సంపన్నులని యంటిని. విధివిహితమగు షోడశకర్మలను విధిగా నిర్వర్తింతురు.

నా యింట నంబూదిరీ బ్రాహ్మణుడొకడు కొంతకాలముగ వంటచేయుచున్నాడు. నంబూదిరీలలో వంటచేయువారు అరుదుగ నుందురు. అయితే కొచ్చిరాజుల ఇండ్లలో నంబూదిరీలే వంటచేయుదురు గనుక నా స్నేహితులు, కొచ్చి రాజకుమారులలో నొకరు నగు శ్రీ రాజా రవివర్మగారు వారింట వంటజేయు శంకరనంబూదిరీని నాయింట వంట చేయుటకు పంపిరి. ఈ శంకరుడు నా యింటికి వచ్చిన నాటినుండి నాయందు భక్తి విశ్వాసములుగల్గి పితృభక్తితో నన్ను సేవించుచున్నాడు. ఇతను చదువరి. ఆచార వంతుడు. ప్రాతఃకాలమున చన్నీళ్ల స్నానమొనర్చును. తెల్లవారి స్నానముచేసిగాని నాకు కాఫీపెట్టి యివ్వడు. ఈ వంట వానిని నేను 'తిరుమేని' అని పిలువవలయును. అనగా 'శ్రీశాస్త్రిగారూ' అనే పిలుపువంటిది. ఈ తిరుమేని చాలనెమ్మది వాడగుటచే వాని నప్పుడప్పుడు చనువుగ దగ్గరకుపిలిచి కూర్చుండబెట్టుకొని వార్లకులాచారములను తెలుసుకొనుచుందును. ఇక్కడ నేవ్రాసిన నంబూదిరీ బ్రాహ్మణుల ఆచారములన్నియు చాలవరకు నా వంటవానివల్ల తెలిసినవే.

విధివిహితమగు షోడశకర్మలలో జాతకర్మ మొదటిది. బిడ్డపుట్టిన 36 గం॥ల లోపున బిడ్డతండ్రి బిడ్డ ముఖారవిందమును చూచును. అంతట నాతడు స్నానముచేసి

వచ్చి బిడ్డను వడిలో కూర్చుండబెట్టుకొని జాతకర్మ మొనర్చును. అప్పుడే ఆతడు శిశువు దీర్ఘాయువునకై యోగక్షేమములకై దానధర్మము లొనర్చును. నేతిని, తేనెను కొద్దిగా కొద్దిగా తీసికొనికలిపి దానికి కొంచెము బంగారమునుచేర్చి, అదృష్టచిహ్నముగా దానిని బంగారు కడ్డితో కలియబెట్టి ఒక బంగారు పాత్రతో బిడ్డ గొంతులో పోయును. ఆ కార్య మొనర్చుచు కొన్ని ఋగ్వేద మంత్రముల నతడు వల్లించును. ఆ విధముగా నా కాల పరిమితిలో నది జరుగనిచో పురుడు వెళ్లు వరకు జరుగుటకు వీలులేదు. పురుడు మన దేశములోవలెనే 10 రోజులు పట్టుదురు. 11 వ రోజున బాలింతశుద్ధి స్నానమొనర్చును.

పిదపకర్మ నామకరణము. మనవలె 11 వ రోజునగాక 12 వ రోజున జరుప బడును. తండ్రియే బిడ్డను వడిలో కూర్చుండబెట్టుకొని, మంత్రపూతముగా, విసర్గాంత మగు నామధేయమును సంస్కృతమున బిడ్డచెవిలో ఉచ్చరించును. తండ్రిపిదప తల్లియు అట్లే ఆ నామధేయమును శిశువు చెవిలో చెప్పును. 13 వ రోజున నామకరణ మొన ర్చుట వారికి శుభస్కరముకాదట!

బిడ్డకు నాలుగవ మాసము వచ్చువరకు బాహ్యప్రదేశమునకు బిడ్డనుతేరు. అప్పుడు 'నిష్క్రమణము' అని యొక కర్మ జరుపబడుచున్నది. ఇందుకుగాను పనసచెట్టు నొక దాని నలంకరింతురు. బిడ్డ నప్పుడారుబయటికి తెచ్చి బిడ్డకాలితో ఆ పనసచెట్టువేరు త్రొక్కింతురు. మామూలుగ బ్రాహ్మణులకు దానధర్మము లొనర్తురు.

శిశువు దినదినాభివృద్ధినందుచుండగా ఆరవనెలయందే అన్నప్రాశనము జరుగును. శుభముహూర్తమున అన్నమును, తేనె, నేయి, చక్కెరలతోచేర్చి శిశుచే తినిపించుదురు. ఈ అన్నప్రాశన సమయమున అశ్వలాయనగృహ్యసూత్రానుసారముగ మంత్రములుచదువ బడును. అన్నప్రాశనకు 5, 7 నెలలు మంచివికావు.

పిదపజరుగు కర్మచౌళము — అనగా ప్రథమముగా కేశఖండనము. మనదేశమున బాలురకే ఈ మహోత్సవము జరుపబడును. ఆదేశమున బాలికలకును జరుపుదురు; అది వారికి అశుభముకాదు. సామాన్యముగ నిది 3 వ సం॥ ననో, 5 వ సం॥ ననో జరుప బడును. ఒక్కొక్కప్పుడు బాలురకైదవఏటను బాలికలకేడవఏటను జరుపబడుటకలదు. బాలురకు శిఖవిడిచి తలయంతయు గొరుగబడును. బాలికలకు ఒకటిరెండువెండ్రుకలు మాత్రము లాంఛనముగ తీసివేయుదురు. పూర్తిగ తీసివేయుటయు తప్పుకాదు. అయితే పూర్తిగ క్షౌరముచేసినప్పుడుమాత్రము నడినెత్తిన కోలగా వలయాకారమున కొంత మేర వదలివేయుదురు. ఈకార్యమును సామాన్యముగ 'మారార్' అను శూద్రుడుచేయును. ఇతడు దేవాలయముల పనులుచేయు జాతివాడు. ఈ కర్మజరుగునపుడు అశ్వలాయన సూత్రానుసారము బిడ్డను అగ్నిహోత్రమునకు పడమరగా తల్లి వడిలోకూర్చుండబెట్టు

కొనును. తండ్రి తల్లికి దక్షిణముగాకూర్చుండి 21 దర్భపోచలు చేతబట్టి బిడ్డతలపై మంత్రపూర్వకముగ జలమును చిలకరించును.

ఆతరువాత కర్ణవేధము - అనగా చెవులుకుట్టుటకూడ - 3 వ ఏటనో, 5 వ ఏటనో జరుగును ఇదియును మంత్రపూర్వకమే. ఈపనిగావించుటకుముందు బాలునికి చక్కగా భోజనముపెట్టుదురు.

అట్లే, మూడవ సం॥న గాని, 5 వ సం॥ నగాని అక్షరాభ్యాసమగును. ఇందుకు సామాన్యముగా విజయదశమినే శుభముహూర్తముగా నిర్ణయింతురు. గణపతిపూజాదికములైనపిదప బాలునికి తండ్రియో, పోషకుడో బంగారపుటుంగరముతో 'ఓం'కారమును నాలుకపైవ్రాసి చెవిలోనుచ్చరించును. అంత పిల్లవాని వుంగరపువ్రేలుపట్టి బియ్యములో 52 అక్షరములు చెప్పుచువ్రాయించును. కాని మున్ముందుగా మనము "ఓంనమఃశివాయ సిద్ధంనమః" అన్నట్లే - వారు "ఓం హరిశ్రీగణపతయేనమః" యనిచెప్పింతురు. బాలుడు బుద్ధివిశారదుడగుటకై మంత్రపూర్వకముగ వెన్న తినిపింతురు. పూర్వము చోళదేశము నుండి మళయాళమునకు వెళ్లిన ఉద్దండశాస్త్రి పాండిత్యవిశేషముచే సాలుసాలున రాజిచ్చు పండితబహుమానము పొందుచుండెనట. అంతట నంబూదిరీలందరుకలిసి యొక ఉత్తమ గృహస్థుని నిర్ణయించి ఆదంపతులకు జపతపములతో మంత్రపూతమైన ఆహారమును సంవత్సరము రోజులు దీక్షతోనిడి వారుకన్నకుమారునికి అట్లే మంత్రపూతమైన ఆహారమిచ్చుచురాగా నతడు 12వ ఏట ఉద్దండశాస్త్రిని పాండిత్యాతిశయముచే ఓడించివేసెనట. కావున మంత్ర ప్రభావమున బుద్ధివికసించునని వారి విశ్వాసము.

గర్భాష్టమియందుగాని, అష్టమవర్షమందుగాని ఉపనయనము జరుపబడును. ఉపనయనవిధి చాలావరకు మనదేశమునందువలెనే జరుగును; కాని యజ్ఞోపవీతధారణానంతరము మనపురోహితులు బ్రహ్మచర్యవిధులు - గ్రుక్కత్రిప్పకుండ సంస్కృతమున ఏకరువు పెట్టదురు. వారుఅట్లుగాదు; సంస్కృతమునచెప్పినదానిని బాలునకన్వయమగుటకు మళయాళ భాషలోకూడచెప్పుదురు. ఏలననగా మనబాలుడు మరునాడే తిరిగీ హైస్కూలుకో కాలేజీకో పరుగెత్తును. నంబూదిరీబ్రాహ్మణబాలుడట్లుగాక నిజముగ గురువువద్దనే చేరి, బ్రహ్మచర్యవిధుల నాచరించుచు అధ్యయనమొనర్చును. సమగ్రముగ గురువువద్ద వేదవేదాంగములను నేర్చినపిదప సమవర్తనకర్మనాచరించి ఇంటికిమరలును. ఈ ఆచారమింకను అచ్చట ఎన్నో ఉత్తమనంబూదిరీ కుటుంబముల నవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వీరిలో పెద్దవాడొక్కడే స్వకులమున వివాహమాడును. పిదప సోదరులందరును అక్కడ అగ్రజాతిశూద్రులైన నాయర్‌స్త్రీలను వివాహమాడుదురు. ఈ ఆచారము ఎట్లువచ్చిన దనుదానినిగూర్చి పలుగాథలున్నవి. ఈ నంబూదిరీలు తొలుతవచ్చినప్పుడు

వీరితోకూడ కొలదిమంది స్త్రీలేవచ్చిరట. పురుషులందరికి చాలినంతమంది స్త్రీలులేరు - పెద్దవాడుమాత్రము స్వకులమున వివాహమాడుటయు, మిగతవారు పరిచారికలైన శూద్రస్త్రీలను వివాహమాడుటయు ఏర్పడిన దందురు. ఈ శూద్రులైన నాయరుల పుట్టుపూర్వోత్తరములేమి, వీరి ఆచార వ్యవహారములేమి యనునది పిదప వ్రాయుదును. ఇక్కడ నంబూదిరీలను గూర్చియే వ్రాయుచున్నాను.

జమీందారులగు నంబూదిరీలు వారి ఆస్తి చీలిపోకుండ ఏకముగానుండుటకై ఆచారము నేర్పరచుకొనిరని కొందరందురు. మొదట ఎట్లువేర్పడినను - ఇప్పుడు నంబూదిరీ స్త్రీలును విస్తారముగనేయున్నారు. కాని పెద్దవాడొక్కడే వివాహమాడవచ్చునని యున్నది. కావున తగినంతమంది పెండ్లికొడుకులు లేక చాలమందిస్త్రీలు అవివాహితలై యుందురు. ఆడపిల్లలతండ్రులు వేలాదికట్నమిచ్చి పెండ్లికొడుకుల లభ్యపరచుకొందురు. ఈ కట్నములను తప్పించుకొనుటకై ఒక్కనికే పలువురుస్త్రీలను కట్టిపెట్టుటయుకలదు. అయినను పలువురు ఆ జన్మాంతము అవివాహితలుగానే యుండిపోవుదురు. పెద్దవాడు తనకిక పురుషసంతతి దుర్లభమనితోచిన, ఇంకను వివాహమాడుటకు తరుణముతప్పిన, తన తమ్మునికి కులస్త్రీని వివాహమాడ ననుమతినిచ్చునట! అప్పుడు కట్నములేకయే లభ్యమైన అతనికి పిల్లనిత్తురు.

నంబూదిరీలలో బహు భార్యాత్వమున్నదేగాని బహుభర్తృత్వములేదు. వితంతు వివాహమును లేదు. రజస్వలాత్పూర్వమే వివాహమాడవలయునని నిర్బంధమును లేదు. రజస్వలానంతర వివాహములే కడుసామాన్యము.

### వి వా హ క్ర మ ము

వరుని వీరు మనవాళన్ అని పిలుతురు. ఈ మనవాళన్‌ను స్వకులములో ఉత్తముని గా చూతురు; కాని సమీపరక్తబంధువులు వివాహమాడరాదు. ఉత్తముడనగా వేదవేదాంగముల నభ్యసించినవాడు; సదాచార సంపన్నుడు. ధనవంతుడు. అంతే గాని మన దేశమునవలె ఇంగ్లీషు చదువు వారికి లెక్కలేదు. అచ్చట కుమారులలో పెద్దవాడే వివాహయోగ్యుడు కావున ఆడపిల్లలకు వరుడు దొరకుటయే కష్టము. అందుచే నంబూదిరీలలో వరాన్వేషణమేగాని వధువునన్వేషించుట యెరుగరు. తగిన వరుడు దొరుకగనే వధూవరుల జాతకమును జ్యోతిష్కున కప్పగింతురు. అక్కడ జ్యోతిష్కులు ప్రత్యేకకులము. జాతకములు సరిపడినప్పుడు వరునితండ్రిసమ్మతి కోరుదురు. నంబూదిరీయొక్క వంశమర్యాద, కులీనత, ధనాధిక్యతలనుపట్టి కట్నము నిర్ణయము; ఈ కట్నము వేలువేలు.

వివాహవిధులు చాలవరకు మనకువలెనే జరుగుతున్నవి. అయినను కొన్ని వింత

దేశాచారములు కలవు. పెండ్లికొడుకు బంధుమిత్రులతో కలిసి పెండ్లికి తరలివెళ్లును. ఆతనితోకూడ అతనిని తమ ఏలికగా తలంచుకొందరు నాయర్లు - కత్తులు, కటార్లు త్రిప్పుకొనుచు వత్తురు. నంబూదిరీ స్త్రీలు ఘోషా నాచరింతురు; పరపురుషులకంట బడరు - కావున వారెవ్వరును పెండ్లికొడుకుతో రారు. పెండ్లికూతురు ఇంటివద్దకూడ ఇంటివారైన నంబూదిరీ స్త్రీలును పై కారణముచేతనే వెల్లడికివచ్చి పెండ్లికుమారు నాహ్వానించరు. కాని పెండ్లికూతురి ఇంటికి సంబంధించిన నాయరుస్త్రీలు కొందరు నంబూదిరీ స్త్రీలవలెనే వేషభూషణముల ధరించి ఎదురై పెండ్లికొడుకు నింటిలోనికి గొంపోవుదురు. పుణ్యాహ మొనర్ప వెళ్లునపుడు అతనిముందు నంబూదిరీ యొకడు దీపారాధన పట్టుకొని నడుచును. అక్కడ పీటపై కూర్చోగానే - నాయరు స్త్రీ యొకతె వచ్చి చక్కెరకలిపిన నీటి పాత్రను అతని వెనుకపాటుననిలిచి చుట్టు త్రిప్పును. అప్పుడు మామగారువచ్చి అల్లునికి నమస్కరించి ప్రతినమస్కారమును స్వీకరించి, ఆతనికి ఆచమన మొనర్ప నీటితో పాత్రనిచ్చును. అప్పుడతడు కమ్ములువేసిన నాలుగు పంచల చాపును (వారు చిన్నతుండు గుడ్డలనే పిఱుచుట్టుగా చుట్టుకొందురు.) ఇచ్చును. అది పెండ్లికూతురున కివ్వగా ఆమె అందుండి రెండుచించి తాను ధరించుటకు తీసికొని మిగత రెండున్నూ తిరిగి పెండ్లికొడుకు కంపును. అప్పుడతడు వానిని ధరించును. ఇవే మన మధుపర్కములన్నమాట. వీనిని వారు 'మంత్రకోడి' యని పిలుతురు.

పెండ్లికూతురిని సంపూర్ణముగ మేలిముసుగువైచి వరుని వద్దకు పిలుచుకొని వత్తురు. అప్పుడామె పెళ్లికుమారుని ముఖముచూడకుండ అతనికి తన ముఖము కనుపడకుండ - తాటియాకు గొడుగును అడ్డుపెట్టుకొని పూమాల నొకటి ఆతనిచేతి కందించును. ఆతడు దానిని ధరింపగా పురోహితులు వేదమంత్రములు పఠించుచుండ- వధూవరులు ఒండొరుల చూచుకొందురు.

వారిలో పెండ్లికూతురునకు తాళిబొట్టు కట్టునది భర్తకాదు; తండ్రి. అనగా వారు బాలికలకు తాళిబొట్టు కట్టుటను బాలురకుపనయన మొనర్చి యజ్ఞోపవీతము వేయుటవంటిదిగా భావింతురు. మాంగళ్యధారణానంతరము, ఉదకపూర్వకన్యాదానము, పాణిగ్రహణమును జరుగును. పాణిగ్రహణమప్పుడు పెండ్లికూతురు ఒకచేత అద్దము పట్టుకొని కుడిచేయిచాచి వ్రేళ్లు ముడుచును. ఆ ముడిచినచేయి వీడదీసి అతడు పాణిగ్రహణ మొనర్చును. ఆ పాణిగ్రహణమున అతడు బొటనవ్రేలుపట్టి గలిగినచో మొగపిల్లలు కలుగుదురట. ఇతర వ్రేళ్లైన ఆడపిల్లలు. అన్నియుకలిపి తెరిచిపట్టిన వారు వీరు సమానముగ నుందురట. పాణిగ్రహణము అనంతరము వధూవరులు అగ్నిహోత్రమునకు ప్రదక్షిణముగావింతురు. ఆ వెంట సప్తపదిజరుగును. మనలో మాంగళ్యధారణమే

వివాహచిహ్నము. వారికట్టిగాదు. సప్తపది, ఉదకపూర్వం, పాణిగ్రహణం ముఖ్యములు. ఈ కళ్యాణకలాపమంతయు ముగియగానే మామ అల్లుని చేతులుపట్టుకొని "నాయనా నా బిడ్డను జాగ్రత్తగ కాపాడవలయును." అని ప్రార్థించును. మొదటిరోజు తంతంతయు ముగియగా పిల్లను తోడ్కొని పెండ్లికొడుకు తన యింటికి చేరును. మరిమూడురోజు లక్కడ జరుగును. అవి దీక్షాదినములు. అప్పుడు భార్యాభర్తలు కలిసియేయుండి బ్రహ్మ చర్యదీక్ష వహింతురు. ఆ దీక్షకొందరు సం॥ము రోజులు అంతకుపైనకూడా సాగింప వచ్చును. ఎంతకాల మీదీక్షవహించిన అంతసుపుత్రు డుదయించునట. ఆ దీక్షాదిన ములు గడవగా—నాల్గవరోజున మంగళాస్నానములగును. ఆ రోజున మరికొన్ని తతంగ ములు జరుగగా ఇద్దరుకలిసి ఒకే ఆకున భోజనమొనర్తురు.

ఈ నంబూదిరీలలో బోధాయన సూత్రులు— మరియొక విచిత్రమును చేయుదురు. వధూవరులిర్వురు నొక చెరువునదిగి కుండమూతి గుడ్డతోమూసి అది వలగా నొక చేపను పట్టుదురు. అప్పుడొక బ్రహ్మచారివచ్చి ఆవుదూడ నెక్కడైన చూచితివా — అని అడుగును, అప్పుడతడు ఇదుగో ఆవుదూడయని చేపనుచూపును. వధూవరులంతట ఒకరికొకరు నూనె రాచుకొందురు. వధువువరుని తల దువ్వును; సాయంకాలము పెండ్లికూతురి తలలో భర్త పూలుముడుచును - ఆ సాయంకాలము కంకణవిసర్జనము. దానితో పెండ్లి పూర్తిఅయినట్లే.

మనకు వలెనే వారికిని పున్నామనరకమునుండి యుద్ధరించుటకు పురుష సంతానాపేక్షమెండు. అట్టి పురుషసంతానముకొరకై వారెన్ని వివాహములైన చేసుకొనెదరు. వేలాది కట్నము లివ్వలేక స్త్రీ సంతానాధిక్యతను ఇష్టపడరు.

☞ జనవరి సంచికయందు "ఆడమళయాళము"ను గురించి వ్రాసెదను.






గత అక్టోబరు, నవంబరు "గృహలక్ష్మి" సంచికలలో శిశువ్యాధులను, వాటి లక్షణములనుగూర్చి వివరించియుంటిమి. ఔషధపరిజ్ఞానముకూడా ఇంచుక పొందుపరచదలచితిమి. సూక్ష్మమైనట్టియు సులభమయినట్టియు చికిత్సల వివరము.

1. **అజీర్ణము:-** మనము సామాన్యముగ ఇండ్లలో వాడుకొను ఇంగువను పొడిచేసి నేతిలోవేసి, పొంగించి చల్లారినపిదప, ఉప్పునుచేర్చి కలియనూరి, సుమారు పెసర గింజపరిమాణముగ మాత్రలుగజేసి, తేనెలోగాని, గోరువెచ్చనినీటిలో గానికల్పి యివ్వవచ్చును. వేయించినందున ఇంగువ వాసనైనను బాగుగనేయుండును.

| | |
|---|---|
| ఇంగువ ½ తు.<br>ఉప్పు - 1 తు. | గ్రహించినచాలును. |

2. **కడుపుఉబ్బరము:-** మట్టిలేనట్టి మంచివామును సువాసనవచ్చువరకు బాణలిలో వేయించి, చల్లారినపిదప చూర్ణముగాచేసి అందులో ఉప్పునుగాని - మంచిసోడా ఉప్పునుగాని చేర్చి కలియనూరి పొడిచేసి శుభ్రమయిన సీసాలోయుంచుకొని, పూటకు 3 గ్రెయినులుచొప్పున మంచితేనెలోగాని గోరువెచ్చని నీటిలోగాని కల్పి యివ్వవచ్చును. వాముయొక్క చురుకుదనము వేయించునప్పుడే తగ్గునటుల చూడవలయును.

| | |
|---|---|
| వాము - 1 తులం.<br>ఉప్పు లేక సోడా 1 తులం | చొప్పున గ్రహించవలయును. |

3. **జ్వరము:-** మిరియాలు, పిప్పళ్లు ఒక్కొక్కటి తులముచొప్పునగ్రహించి రెండిటిని వేయించి, తమలపాకురసముగాని, తులసిఆకురసముగానిపోసి కలియనూరి, పెసర గింజలంతమాత్రలుగచేసి పూటకు ఒకమాత్రచొప్పున యిచ్చిన జ్వరము నెమ్మదించును. కారములేకుండుటకు తేనెనుకూడ చేర్చవచ్చును.

4. వాంతులు:- ఆవాలను బాణలిలోవేసి నల్లనిమసి - కాఫీపౌడరు మాదిరిగజేసి తేనెలోగాని, ఔన్సు గోరువెచ్చని నీళ్లలోగాని చిటికెడువేసి, చల్లారనిచ్చి యిచ్చిన వాంతులణుగును. పరిమాణము; 2 తులములు ఆవాలు చాలును.

రెండవపద్ధతి:- నెమలిఈకలను కాల్చి మసిచేసి తేనెలోకల్పి నాలుకకురాచిన వాంతులు నెమ్మదించును.

మూడవపద్ధతి:- ¼ తులం వామును మెత్తగనూరి, సుమారు 2 ఔన్సులనీళ్లలో బాగా పొంగించి, చల్లార్చి వడబోసియిచ్చిన వాంతులు, అజీర్ణము, కడుపుఉబ్బరము శాంతించును. విరేచనములగుటకూడ నిలిచిపోవును. లేదా శుభ్రమయిన వాము వాటరు వున్నయెడల ఉపయోగించవచ్చును. సంవత్సరములోపువారికి యిచ్చునప్పుడు నీళ్లలోకల్పి యివ్వవలయును.





# చారు

దీనిని కొందరు "చారు" అనియు "రసము"నియు, పిలుచుచున్నారు. దీనిని యిప్పుడు ప్రతి గృహమునందును యొకపదార్థముగా వాడుచున్నారు. ఇది మంచివారికిని రోగులకు పథ్యకారిగాయున్నది. మనము తినుఆహారమును సుఖముగా జీర్ణము చేయుచున్నది. ఇది బలహీనులపాలిటి బాలామృతముగ, రోగులపాలిటి ఆరోగ్యరసముగ, పరిగణింపబడుచున్నది. దీనినియిప్పుడు నానావిధములుగా తయారుచేయు పద్ధతులు కొన్నిగా మచ్చటించెదము.

మొదటి పద్ధతి:—మట్టిపాత్రలోగాని, సత్తుపాత్రలోగాని తగుమాత్రము నీరుపోసి దానికి సరిపడు చింతపండు, ఉప్పువేసి, మిరియాలు, జీలకర్ర, ధనియాలు, చిటికెడు పసుపుపొడి వేసి పొయ్యిమీదపెట్టి తెర్లనియ్యవలెను. ఇష్టమున్న తెల్లగడ్డపాయలు నలియకొట్టి వేయవలెను. తెర్లులువచ్చి దించునప్పుడు కొత్తిమిరి, కరివేపాకువేసి దించవలెను. ఇది పూర్వపద్ధతి.

## రెండవ పద్ధతి:—చారుపొడి పద్ధతి

(¼) పావుశేరు కందిపప్పు, ఒకపలం మిరియాలు, ½ పలం జీలకర్ర, నవటాకు (⅛ శేరు) ధనియాలు, ఒక పసుపుకొమ్ము, కొద్దిగ యింగువవేసి పొడిచేసి యుంచుకొనేది. పైపద్ధతి ప్రకారము పాత్రలో నీరుపెట్టి, తగుమాత్రము చింతపండు ఉప్పువేసి, పొడిచేసియున్న చారుపొడిని టేబిల్‌స్పూనెడు మాత్రమువేసి, తెర్లురాగానే కరివేపాకు కొత్తిమిరివేసి, దించి వాడుకొనేది.

## మూడవ పద్ధతి:—నిమ్మచారు

సత్తుపాత్రలోగాని, మట్టిపాత్రలోగాని కందిపప్పువేసి బాగుగా ఉడకనిచ్చి పప్పును రొనిచియుంచుకొనేది. తదుపరి ఆ నీటిలో చారుపొడిగాని, మొదటి పద్ధతి ప్రకారం చారువస్తువుల నలియకొట్టిగాని, తగుమాత్రమువేసి తెర్లులురాగానే దించి, దానిలో నిమ్మకాయ రసము తగుమాత్రము ఉప్పువేసి యుంచేది. తదుపరి గరిటెలో కొద్దిగ నెయ్యివేసి మిరపకాయలు, ఆవాలు, జీలకర్రవేసి తిరుగబోతవేసి వాడుకొనేది. రుచిగా యుండును, పైత్యశరీరులకు అనుకూలముగా యుండును

## నాల్గవ పద్ధతి:—కట్టుచారు

నవటాకు (⅛ శేరు) కందిపప్పును భాగుగా యుడకనిచ్చి, తరువాత చారుకుకావలసిన నీరు పోసుకొని, చింతపండు ఉప్పు తగుమాత్రమువేసి యుంచేది. తర్వాత బాణలిలో కొద్దిగా కందిపప్పు, మిరియాలు, ధనియాలు, జీలకర్ర, కొద్దిగ యింగువవేసి, నెయ్యివేసి యీవస్తువులు వాసనవచ్చువరకు వేయించి, పొడిచేసి, వేరుగాయుంచబడిన నీటిలోవేసి తెర్లులురాగానె కరివేపాకు కొత్తిమిరివేసి, దించి మూడవ పద్ధతి ప్రకారం

తిరుగఁబోతవేసి వాడుకొనేది. యీ పద్ధతి యిప్పుడు చాలా వాడుకలోయున్నది. ఆరోగ్యజీర్ణకారి. రోగులపాలిటి ఆరోగ్యరసము, మంచి పద్ధతి.

### అయిదవ పద్ధతి:—బెంగుళూరురసము

కందిపప్పు ఒక పురిషెడు (షుమారు $\frac{1}{8}$ శేరు) బాగుగా ఊదకనిచ్చి, చారుకు తగిన నీటిలో యీ వుడికిన పప్పును మెత్తగా ఎనిచి యుంచుకొనేది. తదుపరి చింతపండు, ఉప్పు తగుమాత్రము తీసుకొని పిప్పిలేకుండా నీటిలోకలిపి, ఉడికించి దించి యుంచుకొనేది. తర్వాత బాణలిలో కొద్దిగా శనగపప్పు, తగుమాత్రము మిరియాలు, ధనియాలు, జీలకర్ర, ఇంగువ, నెయ్యివేసి వేయించి పొడిచేసుకొనేది. కందికట్టున్ను, చింతపండు పులుసున్నుకలిపి పొయ్యిమీదపెట్టి పైపొడివేసి తెర్లుతెర్లగనె దించి మూతపెట్టియుంచేది. తర్వాత మూడవ పద్ధతి ప్రకారం తిరుగఁబోఁతపెట్టి వాడుకొనేది.

### ఆరవపద్ధతి:—మైసూరు రసము

కందిపప్పు తగుమాత్రము బాగుగావుడికించి, ఎనిచి, చింతపండురసము ఉప్పువేసి యుంచేది. తర్వాత కందిపప్పు ఒక భాగము, మిరియాలు $\frac{1}{2}$ భాగము, $\frac{1}{4}$ భాగము జీలకర్ర, $\frac{1}{8}$ భాగము మెంతులు, ధనియాలు, కొద్దిగా యింగువవేసి వేయించిగాని, వస్తువులు పచ్చివిగాని పొడిచేసి యుంచుకొనేది. పైన కట్టుచింతపండు కలిపిన రసములో యీ పొడివేసి తెర్లులురాగానే కరివేపాకు, కొత్తిమిరివేసి దించుకొని మూడవపద్ధతి ప్రకారం తిరుగఁబోఁతపెట్టి వాడుకొనేది.

### ఏడవపద్ధతి:—పచ్చిమిరపచారు

పచ్చిమిరపకాయలు, కందిపప్పుగాని, పెసరపప్పుగాని పాత్రలో తగుమాత్రమువేసుకొని మెత్తగా ఉడికించి దించుకొనేది. తదుపరి మిరియాలు, ధనియాలు, జీలకర్ర, కొద్దిగా మెంతులు, ఇంగువవేసి వేయించిగాని, పచ్చిదిగాని పొడిచేసేది. పైపాత్రలోయున్న నీటిలో యీ పొడినివేసి, చింతపండు ఉప్పు తగుమాత్రము వేసుకొని తెర్లురాగానేదించి యుంచుకొని పైమూడవపద్ధతి ప్రకారం తిరుగఁబోతపెట్టి వాడుకొనేది.

1. రసమునుదించి యుంచిన తరువాత వాడుకొనునంత వరకును మూతపెట్టి యుంచవలెను.
2. రసము వేడిగా యుండునప్పుడు వాడుకొనుట మంచిది.
3. లోహపాత్రలో పెట్టిన రసముకంటె మట్టిపాత్రలోని రసము ఆరోగ్యకరము. రుచికరము.
4. రసమునకు వాడబడు వస్తువులు పాత్రలోని నీటి పరిమాణమునుబట్టి యుపయోగించుచుండవలెను.

పాటూరు వెంకటశేషమ్మ.

## గృహలక్ష్మి పాకకళ

శాస్త్రయుక్తమగు పాకకళా రహస్యములను తొలుత "గృహలక్ష్మి"లోను, పిదప పుస్తక రూపమునను ప్రచురింపవలయునని మా యుద్దేశము. అందుకుగాను పాక కళావేత్తలైన "గృహలక్ష్ములు" తమ అనుభవముల ననుసరించి వివిధపాక విశేషముల తయారుచేయు విధానమును, తమ చిత్రములను తప్పక పంప ప్రార్థితులు.

గృహలక్ష్మి సంపాదకులు

# ఇంటిపనులలో మెళకువలు



మగవాళ్ల ధోవతులు, కండువాలు, మడికనో, దడికనో, స్నానానికనో కట్టుకో రాదు. నీ భర్తవైనా అంతే. మనిషిమీద ఉండే చనువూ స్వతంత్రమూ మనిషి వాడుకొనే వస్తువులమీదను చూపరాదు.

♦ ♦ ♦

అట్లే ఇతరుల చెప్పులు, కలం, తుండుగుడ్డ, సబ్బు, దువ్వెన మొదలైన వస్తువులు వాడుకోరాదు. ఆ యీవస్తువులు, ఇంట్లోవారివే ఒకరివి మరొకరిని వాడుకోనివ్వరాదు. తప్పనిసరియై ఏ దువ్వెనైనా వాడితే వెంటనే కడిగి శుభ్రం చేసిపెట్టు.

♦ ♦ ♦

ఇంటికివచ్చిన అతిథిబట్టలు ఇంటిబట్టలలో కలవనివ్వకు. ఇంటిపనుల కుపయోగించకు. వారివస్తువులు అలాయిదాగా ఉంచు; నీ యింట్లో పరాయివారు ఫలానావస్తు వెక్కడ ఉన్నదో వెతుక్కోలేరు.

♦ ♦ ♦

గృహలక్ష్మివి, ఇంట్లో పనికత్తెవేగాక చదువుల సరస్వతివికూడ. నీ కిప్పటికే చదువను, వ్రాయను, లెఖలు రాకుంటే వెంటనే నేర్చుకో. ఇకపై భారతదేశంలో చదువు రాకుండా ఉండడం స్త్రీకిగాని పురుషునకుగాని ఘోరమైన అపచారం.

♦ ♦ ♦

నేర్చిన చదువు వ్యర్థంగాకుండా మరిచిపోకుండా నిత్యకృత్యంలో ఉపయోగించుకో. చాకలిపద్దు, అంగటిసామాను, మరచిపోతావేమో అన్నమాట, తోచిన మధురమైన ఆలోచన—వ్రాసిపెట్టుకొనే చాకచక్యమైనా నీ కుండాలి.

♦ ♦ ♦

పప్పులు, పిండ్లు ఉంచేడబ్బాలమీద పేర్లు వ్రాసి చీట్లు అంటించుకొనే నేర్పు అయినా నీ కుండాలి. అట్లా వ్రాయకపోతే, అన్నిడబ్బాలు ఒకేరీతిగా ఉంటాయి గాబట్టి-మూత తీసిచూస్తేగాని తెలియదు. నాలుగుడబ్బాలు మూతలుతీసి చూచుకొనేటప్పుడు నీ కెంతో విసుకు, చిరాకు. పేర్లు వ్రాసి ఉంచుకుంటే సులభంగా తెలుసుకోవచ్చు.

♦ ♦ ♦

'ఆఁ ఇదివక పెద్దకునా' అనకు. మూత గట్టిగా బిగించకపోతే ఎలుకలపోరు; బిగిస్తే ఒక రాగానరాదు; సమయానికి అట్లకాడో, మిల్లిగరిటో, ఉద్ధరిణో మూత లేవనెత్తను కన్పించదు. సామాన్యంగా మీయింట్లో మిల్లిగరిటెలు, అట్లకాడలు, చిన్న

గరిటెలు, ఉద్ధరిణెలు కొనలు విరిగిపోయిఉంటాయే; యెందుకని? ఇట్లా డబ్బాల మూతలు లేవనెత్తను ఉపయోగించడంలో జరిగిన పని. ఈ భాదరబందీ పడలేక ఒక్కొక్క ఇల్లాలు మూతలు తీసే ఉంచడం జరుగుతుంది. అప్పుడు కష్టించి ఆమె భర్త తెచ్చిన పప్పులు సగము ఎలుకలపాలు. కాబట్టి డబ్బాలపై వస్తువు పేరు వ్రాసి ఉంచుకోడం చాలా అవసరం. దానికని ఇంకొకరిని అడుగ నవసరం లేకపోవడం, నీ కాత్మగౌరవం.

♦ ♦ ♦

నీకే చదువను వ్రాయను వచ్చిఉంటే నీ తల్లిదండ్రులకు, అన్నదమ్ములకు, అక్క చెల్లెళ్లకు, ఆడబడుచులకు నీవే స్వయంగా ఉత్తరం వ్రాసుకోవచ్చు; వారు వ్రాసిన ఉత్తరం నీవే చదువుకోవచ్చు.

♦ ♦ ♦

ముఖ్యంగా నీ భర్త పొరుగూరువెళ్లితే నీవే స్వయంగా ఉత్తరం వ్రాయవచ్చు; అట్లాగే అతని ఉత్తరం నీవు చదువుకోవచ్చు. అవి ఇతరులచేత వ్రాయించి, చదివించ వలసివస్తే - మీ గృహచ్ఛిద్రాలు ఇతరుల కెందుకు తెలియాలి; మీ ప్రేమాతిశయాలు ఇతరులు ఎందుకు గ్రహించాలని నీ కనిపించదూ?

♦ ♦ ♦

సామాన్యమైన లెఖలు తెలియడంకూడా అవసరమే. చాకలికి ఎన్ని గుడ్డలు వేసింది - కూడి మొత్తం తేల్చడానికి కూడికరావాలి. దాసీదానికి, పాలదానికి, మజ్జిగ దానికి నాగాలు తేల్చడానికి, తీసివేతరావాలి. వాళ్లలెక్క తేల్చను హెచ్చించడంరావాలి. ఏవైనా పంచవలసివస్తే ఒక్కొక్కరికి ఎన్నివస్తాయి అని తెలియను భాగహారం రావాలి. పండ్లు, కాయలు, కూరలు కొనడానికిన్ని డబ్బు లెఖ తెలియాలి.

♦ ♦ ♦

క్యాలెండరు చూడడం, పంచాంగం చూడడం తెలుసుకోకపోతే - నీవాక గోడవంటా రీరోజులలో

♦ ♦ ♦

తగుమాత్రం సివిక్సు (పరిపాలనావివరములు) కూడా నీకు తెలిసిఉండవలె. పోస్టాఫీసులో కార్డు, కవరు ఎంత కిస్తారు; ఎంత తూకానికి ఎంత బిళ్ల వేయాలి; మణియార్డరు, రిజిస్టరు మున్నగువాని కెంతెంత తీసుకుంటారు; పోలీసు రిపోర్టు ఎట్లా ఇవ్వవలె; ఇవి తెలుసుకోవాలి. ఏ డిపార్టుమెంటుకు ఏ ఏవిషయాలమీద అధికారమో తెలుసుకోవాలి.



# బ్రతుకుతెరువు



బ్రతుకుతెరువు కేవలము ధనసంపాద్యమునకే కాదు. స్వయంకృషివల్ల కుటుంబఖర్చు తగ్గించుటకూడా అందులో నొకభాగమే. నేడు జీవితావసరము లన్నియును దుర్లభములైయున్నవి. ముఖ్యమైన అన్నవస్త్రములకే లోటువచ్చియున్నది.

మన ఆంధ్రదేశమున ముఖ్యమగు ఆహారధాన్యము వరిబియ్యము. ఆ పంట విస్తారము కృష్ణాగోదావరి, పినాకినీ కావేరి, తుంగభద్ర డెల్టాలలో పండుచున్నది. ఇంకను చెరువులక్రిందకూడా పండుచున్నది. అయితే, నదులప్రాజక్టులున్న జిల్లాలుతప్ప మిగతప్రాంతములలో ఆజిల్లావాసులకు తగినంత వరిపంటపండుటలేదు. కావున హెచ్చుపండు డెల్టాప్రాంతములు తగ్గుపంటగల మిగతప్రాంతముల నివాసులను తమసోదర సోదరీమణులుగా భావించి తాముకొంత త్యాగమొనర్చియైన వారికిని సప్లైయగునట్లు చూడవలయును. ఇందు కేమిచేయవలయును?

(1) పండినపదార్థములో తమ కత్యవసరమైనదానికన్న మించి ఉపయోగించరాదు. రాష్ట్రమందంతట పండుపంటను అంచనావేసియు, ఇతరప్రదేశములనుండి యూనియన్ ప్రభుత్వము తెప్పించి సరఫరా యొనర్పగలదాని నంచనావేసియు, ప్రతిమనిషిన్నీ ఇంత తినదగును అని నిర్ణయింతురు. ఆ పరిమితిదాటకుండ మనము తంటాలుపడవలయును.

(2) అయితే అసలే దుర్బలులతోకూడిన జనముగల మనదేశము తిండితగ్గించి తినుట మంచిదికాదు. ధాన్యమునకు ప్రత్యామ్నాయమైన ఆహారమునుభుజించవలయును. అవసరమైనచో దానినిసృష్టించవలయును.

ఈ రెండుపనులున్నూ గృహలక్ష్మి వివేకముతో గావింపసాధ్యమైనవి. పురుషుడు పగలెల్లయు చెమటఊడ్చి కష్టించి డబ్బు తేగలడు. వస్తూత్పత్తి చేసినను, ఆకర్మాలయయజమాని ఆసరుకును తానేయుంచుకొని దానిని విక్రయింపగా తానుపొందులాభమునుండి కొంతధనమునుమాత్రమే అతనికి కూలిగా నొసంగగలడు. కావున పురుషుడు డబ్బే తేగలడుగాని వస్తువు సృష్టింపజాలడు. పురుషుడు తెచ్చిన డబ్బునుపెట్టి స్త్రీ ఆవస్తువుకొనును. అట్లుకొనక ఏమేరకు ఆమెకష్టించి వస్తువు సృష్టించగలుగునో ఆమేరకామె బ్రతుకుతెరువు పట్టినదగును.

ఇందుమొదటియంశమున గృహలక్ష్మి చేయదగినది క్లిష్టమైనను ముఖ్యమైనది. అసలు వరిబియ్యమే తక్కువసారముకలది. కావున మరబియ్యముకన్న దంపుడుబియ్యము శ్రేష్టము. అయితే ఈరేషను రోజులలో దంపుడుబియ్యము దొరుకుట దుర్లభము. కావున మరబియ్యమునైనను హెచ్చుపాలిష్ చేయక వాడుటమంచిది. కడుగుటలోను తవుడంతయుపోవునట్లు ఒకటికి నాలుగుసార్లు కడుగుటయు తగదు. తవుడుకూడిన బియ్యపు అన్నము ముదుగుగాఉన్నను ఆరోగ్యప్రదమైనది. అరగదంచి-తవుడంతయుపోవ కడిగినబియ్యపు అన్నము పరిశుభ్రముగా కన్పించునుగాని కడుపునిండుగా తిన్నగాని తృప్తియుండదు; అట్లుతిన్నను, అతిశీఘ్రముగనే మరల ఆకలియగుచుండును. అరగదంపించక అనగా పాలిష్ హెచ్చుచేయింపక, ఊరక మన్ను, పైపై ముతక తవుడు, పొట్టు మాత్రముపోవ కడిగినఅన్నము కడుపునిండ తిననక్కరలేదు. పరిమితముగతిన్నను చాలును. తగినబలమునిచ్చును, వెంటనేఆకలియు కాదు.

ప్రస్తుతము ప్రభుత్వమువారు 8 ఔన్సుల బియ్యముతోపాటు 2 ఔన్సుల గోధుమల నిచ్చుచున్నారు: గోధుమల నవశ్యము నుపయోగించుట ప్రతిగృహిణియు నేర్చుకోవలయును. దానినెన్నివిధముల నుపయోగింపవచ్చునో-పాకకళ శీర్షికక్రింద ఇదివరలో జూలై సంచికయందు వ్రాయబడియున్నది. గోధుమనొసంగక జొన్న, రాగి మున్నగుధాన్యము లిచ్చినను త్రోసిపుచ్చక వానినికూడ ఉపయోగించుట కుపాయము

లరయనగును. అవి సామాన్యముగా పేదలుపయోగించునవి గాన గొప్పవారమనుకొనువారు వానినుపయోగింప అభిమానపడుచుందురు. అవి మనపరిసరముల పండునవైనప్పుడు వానినుపయోగించుట మనధర్మము. "ఆముక్తమాల్యద" యందు శ్రీకృష్ణదేవరాయలవారు - "అమృతమైనను జాత్యన్నముతో సమానమా?" అని ప్రశ్నించియున్నారు. ఆయావానినెట్లు, ఎన్నివిధముల ఆహారార్థముపయోగింపవచ్చునో దానినికూడ పాకకళ శీర్షిక క్రింద ఇదివరకు చెప్పబడినదియు, ఇక చెప్పబడునదియు గాంచనగును.

ఇతర ఆహారములు: జీడిపప్పు, వేరుశనగపప్పు, చిరుగడదుంపలు (గెనుసుగడ్డలు) ధాన్యమునకు ప్రత్యామ్నాయముగాని సహకారులుగాగాని తినదగినవస్తువులు అని చెప్పుచున్నారు, వానిని ఆరగింపను యోగ్యముగ తయారుచేయుపనియు గృహలక్ష్మిదే. బెల్లము పాకుబట్టి, కొబ్బరిముక్కలు, ఏలకులు, కలిపి ఉండలుగట్టి తినుటమంచిది.

తేనెయు మంచి ఉపాహారము. దానిని కొనుటకన్న సరియైన ఋతువున చాతుర్యముగ నుత్పత్తి చేసుకొనుట మంచిది. వర్షఋతువున వర్షించకున్నను శరదృతువున బాగుగనే వర్షములు కురిసినవి. ఇక భూమియంతయు పచ్చబడును. చెట్లన్నియు ఆకులురాల్చి, చిగురు చిగిర్చి, మొగ్గతొడిగి, పుష్పించి ఫలించును. మొగ్గవిడియురోజులే తేనెకు ప్రశస్తమైనరోజులు. నిమ్మ దానిమ్మ, మున్నగునవి ఇక పుష్పించును. ఆవెంటనే గుమ్మడి మున్నగు కాయగూర పాదులు పూలు పూయును. ఈ కాలముననే పొలములందు శనగ, ధనియపు మొక్కలు పూతవేయును. అంతలో మామిడిపూత అందుకొనును. దానివెంటనే వేపచెట్లు తలనెరసినట్లు పూతతో నిండిపోవును. ఇప్పుడు చామంతి పూచియున్నది. చామంతి మందగించునప్పటికి మల్లె, మొల్ల, సంపంగి అందుకొనును. మానుసంపంగి ఇప్పటినుండియే పూయుచుండును. ఈ పూవులన్నియు మకరందపేటికలే.

ఇంతకుపూర్వము తేనెటీగలు వాటంతట అవి తేనెపట్లుపెడితే వానినుండి తేనెగ్రహించడం జరుగుతుండేది. పున్నమకు పూరించి అమావాశ్యకారగించునని పున్నమితిథి సమీపంలో తేనెపట్టులు కొట్టేవారు. తేనెటీగలు కుట్టుతవి కాబట్టి వాటిని కొట్టను సాహసికులు కావాలి. వారు సమయానికి లభ్యంకాకపోతే - తేనెహరించిపోయి వట్టిమైనమే దక్కేది. ఇప్పుడట్లా కాదు.

ప్రయత్నపూర్వకంగా తేనెపట్టులు పెట్టించేవిధానం కనుక్కున్నారు. ఆ పరిశ్రమ గృహలక్ష్మి నేర్చుకుంటే మంచి బ్రతుకుతెరువుమార్గం. దానివివరములు వచ్చేనెల వ్రాయబడును.



అ. భా. మ. సభ చెన్నపురి ఆంధ్రశాఖ కార్యనిర్వాహకవర్గము
మహాసభాధ్యక్షురాలు శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్ గారు
మధ్య కూర్చొనిఉన్నారు



# చెన్నపురి ఆంధ్రశాఖ మహాసభ

అఖిలభారత మహిళామహాసభవారి చెన్నపురి ఆంధ్రశాఖ ఈ 14-11-48 తన వార్షికోత్సవమును, మైలాపూరునందలి ఆంధ్రమహిళాభవనమున జయప్రదముగా జరిపిరి. పచ్చయప్పకళాశాలయందు ఆచార్యపదవి నున్న శ్రీమతి సరస్వతీచెన్నకేశవన్. ఎం. ఏ గారు అధ్యక్షతవహించి గంభీరోపన్యాసము గావించిరి. స్త్రీల అభ్యున్నతికి పురుషులు తోడ్పడకుండుటను గూర్చి కొందరికి కొంచముగ కటువుగనున్నను వాస్తవమును తీవ్రముగ విమర్శించిరి. అ. భా. మ. సభ ఆంధ్రశాఖకు కార్యదర్శినియు, అ. భా. మ. సభాస్థాయి సంఘసభ్యురాలునైన శ్రీమతి ఈడ్పుగంటి రత్నమాంబగారు సభాప్రారంభ మొనర్చిరి.

ఉపాహారముల యనంతరము శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మి బి. ఏ., బి. ఎల్ గారు స్త్రీల ఉద్యమమును గురించి, శ్రీమతి మామిడిపూడి వైదేహి ఎం. ఏ., గారు స్త్రీల ఆర్థికపరిస్థితులను గురించి, శ్రీమతి మొసలిగంటి వెంకటరమణమ్మ ఎం. ఏ., ఎల్. టి గారు ఆంధ్రస్త్రీల నాగరికతను గురించి ఉపన్యసించిరి. తదుపరి నీ క్రిందివిషయములను గూర్చి తీర్మానములైనవి. అన్నియు ఏకగ్రీవముగ నామోదింపబడినవే.

1. ప్రధాని నెహ్రూ జన్మదినాభివందనములు.

2. శ్రీ పట్టాభి సీతారామయ్యగారు కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకొనబడినందులకు అభివందనములు.

3. హైదరాబాదు సమస్యను అచిరకాలములోనే అతిసులభముగ పరిష్కరించిన యూనియన్ ప్రభుత్వమునకు, మద్రాసు ప్రభుత్వమునకు కృతజ్ఞత తెల్పుట.

4. మద్రాసులోని ఇతర మహిళాసంఘములకు, సేవాసంఘములకు మన సహకారము కావలసి వచ్చినప్పుడు ఇయ్యవలయును.

5. మద్రాసులో అనేకమంది అనాథపిల్లలు రోడ్లమీద తిరుగుతూ అనేక ఆపత్తులకు గురియగుచున్నారు; కావున వారి సంరక్షణార్థము చేతనయిన శ్రద్ధతీసుకొని ఆ బిడ్డలను ఇతర రక్షణసంఘముల వారికి ఒప్పచెప్పవలయుననుట; అందులకై అయిదుగురు స్త్రీలుగల ఒక కమిటీని ఏర్పాటు చేయవలయుననుట.

6. మద్రాసులో చదివే విద్యార్థినుల సౌకర్యార్థమై ప్రత్యేకముగ బస్సులు నడుపవలయునని కోరుట.

7. రైలులో స్త్రీలకొరకు మరికొన్ని పెట్టెలు వేయించమని ప్రభుత్వమునుకోరుట.

8. విద్యాశాఖ వారికి స్త్రీల విద్యాప్రణాళిక విషయమై తగిన మార్పులు చేయవలయునని హెచ్చరించుట.

పై తీర్మానములైన తరువాత శ్రీమతి టంగుటూరి సూర్యకుమారిగారు తమ మృదుమధురగానలహరిచే సభాసదులను ఆనందాబ్ధి నోలలాడించిరి. ఆవెంట ఆంధ్ర మహిళాసభా విద్యార్థినులు చక్కని వినోదప్రదర్శనముల గావించి సభాసభ్యుల హర్షధ్వనుల చూరగొనిరి.

ఆహ్వానసంఘాధ్యక్షురాలైన శ్రీమతి పప్పు కామాక్షమ్మగారికిని, ఉపాధ్యక్షు రాలైన శ్రీమతి మామిడిపూడి వెంకమ్మగారికిని, తావిచ్చి సకల సరఫరాలొనర్చిన ఆంధ్రమహిళాసభ వారికి, నాట్యప్రదర్శనమున తోడ్పడిన శ్రీమతి సామ్రాజ్యముగారికి, అనేక విధముల తోడ్పడిన పెక్కుమంది సోదరీమణులకు వందనములర్పింపగా సభ ముగిసెను.

---

## వింత డైవోర్సు

ఇంగ్లాండులో యువతి యువకు లిరువురు 1942 లో వివాహమాడిరి. కాని భార్య కామేచ్ఛ తీర్ప నతడసమర్థుడట. అయినను సైన్సు నాశ్రయించి కృత్రిమముగ అతని వీర్యము వల్లనే ఆమె గర్భవతియై బిడ్డను కనినది. కాని సహజమైన నాకోర్కె తీర్పజాలని ఈ మగడు నాకక్కర లేదు అని ఆవిడ దావాచేసినది. ఆమె ఇచ్ఛ తీర్పజాలని మగనితో నామె నేమని బంధించియుంచగలము? అని జడ్జీ ఆ వివాహము రద్దుపరచినాడు. అతని వయస్సు 37; ఆమెకు 31.

# శ్రీ గురువాయూర్ దేవాలయం

శ్రీ కె. కె. మీనన్ బి. ఏ., బి. ఎల్.

(మధుర దేవాలయాల సూపరింటెండెంట్)

అది సాయంసమయం. అస్తంగతుడౌతున్న భానుని స్వర్ణ కిరణకాంతులు ప్రశాంతమనోహరమైన ఆ చిన్న దేవాలయ పరిసరాల మనోజ్ఞప్రకృతిశోభనుద్విగుణితం చేయు చున్నవి. దీపారాధన సమయం ఆసన్నమౌతున్నది. గర్భగుడి వెలుపల స్త్రీలు, పురుషులు, బాల బాలికలు అనేకులు భక్తి తత్పరులై స్వామిదర్శనంకోసం అత్యాతురతతో నిరీక్షిస్తు న్నారు. వారిలో పెక్కుమంది మడికోసం కాబోలు తడి బట్టలతో నేవచ్చారు. ఆలయంలో ఎంత నిశ్శబ్దత!



అంతలోనే గుడి గంటల గణగణ ధ్వనులతో - పూజారులు సుమధురమంత్రనాదాలు చేస్తూ ఇంకనూ విచిత్ర మైన ఢమఢమ ధ్వనులమధ్య ద్వారం ఉన్ముక్తమై అపూర్వా లంకార సంశోభితమైన శ్రీ కృష్ణభగవానుని దివ్యవిగ్రహ సందర్శనము కావడంతో ఆ ఆలయ వాతావరణం ఎంత గంభీరంగా, ఎంత పవిత్రంగా, ఎంత అపూర్వంగా మారి పోతుందో చెప్పలేము. ఆ భక్తులు స్వామిసందర్శన సంజనితానందవివశులై 'నమో-గురువాయురప్పా' అని పలుభంగుల నుతించునపుడు విన్నవారి హృదయాలు భక్తిరసాతిరేకాన ఎంత ఉద్వేగానికిలోనౌతవో వర్ణించలేము. అట్టి బ్రహ్మాండమైన దృశ్యం ఏదేవాలయంలోనూ కనలేము.

నిత్యం దీపారాధన సమయంలోకూడా లెక్కకుమించిన జనాన్ని ఆకర్షించే కొన్నిదేవాలయాలలో ఇది ఒకటి అని చెప్పవచ్చు.

దక్షిణమలబార్‌లోని పొన్నాని తాలూకాలో రైలుమార్గంతో సంబంధంలేక ఒకమూలవుంది ఈదేవాలయంవున్న గురువాయూర్. షోరనూర్‌కుగాని, తిరుచూర్‌కుగాని 20 మైళ్ళదూరంలోవుంది. ఈ రెండుచోట్లనుంచీకూడా అక్కడకు బస్సుమీద సులభంగా వెళ్ళవచ్చు. పట్టాంబినుంచికూడా గురువాయూర్‌కు బస్సుమీద పోవచ్చు.

ఆలయం బహుచిన్నది. బయటినుంచిచూస్తే అట్టహాసం, ఆడంబరం ఏమీ కనిపించవు. దక్షిణభారత దేశంలోని దేవాలయాలపై సర్వసామాన్యంగా కనిపించే శిల్పకళావైభవం ఏమీ ఈ దేవాలయంలో కానరాదు. మధురమీనాక్షి గుడిలోనేమి శ్రీరంగంలో శ్రీరంగనాథస్వామి కోవెలలోనేమి మనం చూచేవైభవోపేతమైన మంటపాలు, శిల్పశోభ ఈచిన్నిగుడిలో కాన్పించవు.

అయితే గురువాయూర్ దేవాలయంలో అడుగుపెట్టగానే అక్కడి శుచి శుభ్రత, భక్తిరసాన్ని హృదయంనుంచి పొంగిపొరలించే ప్రశాంత గంభీరమైన వాతావరణం, లోకాన్నే ఒక్కసారిగా మరపింప చేస్తుంది. భగవంతుని దివ్యమంగళ స్వరూపంలో లీనంకావడంతప్ప అన్యచింతలేమి మనస్సులో చొరబడవు

ఆలయంనుంచి ఈవలకురాగానే "నా మనసారగ ప్రార్థించుకొన్నాను - నాకు సంపూర్ణమైన తృప్తికలిగింది" అని భావించక మానరు.

ఎవరూ ఈదేవాలయాన్ని చూడడానికి వెళ్ళరు. అక్కడ నిశ్చలహృదయాలతో ఒక్కసారి పరమాత్మని ప్రార్థించడంకోసమే వెడతారు.

## ఆలయం పుట్టు పూర్వోత్తరాలు

ఈదేవాలయం అసలు ఏవిధముగా ప్రభవించిందో తెలియదు. దక్షిణ భారతదేశంలోని పెక్కు ప్రసిద్ధదేవాలయాలకు వలెనే, దీనిచరిత్రకూడా నిగూఢంగా వుంది. అయితే ఈ ఆలయాన్నిగురించిన కట్టుకథ పురాణేతిహాసాలు ఎన్నోవున్నాయి. వీటి అన్నిటిలోను ప్రజలు తరుచుగా చెప్పుకొనేది నారదీయ పురాణంలో 'గురువాయూర్ పురమహాత్మ్యం' అనే అధ్యాయంలో వర్ణించబడింది. ఆగాధ ఇది.

పరీక్షిన్మహారాజా కుమారుడు జనమేజయుడు తనతండ్రి సర్పదష్టుడై మరణించినట్లు తెలుసుకొని, సర్పయాగంచేశాడు. ఆ యాగం మూలంగా అసంఖ్యాకంగా పాములు మరణించినవి. తత్ఫలితంగా జనమేజయుడు కుష్టురోగియైనాడు. అతని బంధువులకు, ఆత్మీయులకుకూడ దూరమై శాంతికి, సౌఖ్యానికి మొగమువాచి అహోరాత్రులు అలమటిస్తున్న సమయంలో అత్రేయ మహర్షి గురువాయూర్ వెళ్ళి అక్కడి ఆలయంలో ప్రార్థించుకోమని సలహా ఇచ్చాడు.

గురువాయూర్ ఆలయాన్నిగురించి అత్రేయముని జనమేజయునకు యీవిధంగా వివరించాడు.

శుద్ధపాసుడనే ప్రజాపతివుండేవాడు. ఆరాజా సతీమణిప్రశ్ని. ఆదంపతులు సంతానంకోసం బ్రహ్మను గురించి తపస్సుచేశారు. బ్రహ్మ ప్రత్యక్షమై ఆదంపతులకు పద్మనాభుని విగ్రహమిచ్చాడు. తనకు ఆ విగ్రహం శ్రీపద్మనాభుడే ఒసగినాడనిచెప్పి దానిని పూజించవలసినదిగా ఆదేశించాడు.

శుద్ధపాసుడు మహదానందసంభరితాత్ముడై హిమాలయపర్వతాలకడకరిగి, చతుర్ముఖుని ఆజ్ఞానుసారంగా తపస్సును ప్రారంభించాడు. శ్రీమహావిష్ణువు సాక్షాత్కరించి, తాను మూడు అవతారాలలో వారికడుపున జన్మిస్తానని చెప్పి, తిరోహితుడైనాడు. ఆతర్వాత ప్రశ్ని గర్భవతి అయింది. కుమారుని కన్నది. కుమారుడు ప్రశ్నిగర్భుడనేపేరున ఖ్యాతి నార్జించుకొన్నాడు.

ఆ తర్వాత ఆదంపతులు అదితి కశ్యపులుగాను శ్రీ మహావిష్ణువు వామనుడుగాను అవతరించారు. తృతీయావతారంలో దంపతులు దేవకీ వసుదేవులుకాగా మహావిష్ణువు శ్రీ కృష్ణుడై వెలసినాడు.

కంసునిచంపి ద్వారకను నిర్మించినపిదప శ్రీ కృష్ణుడు ద్వారకాపురిలో ఒక ఆలయంనిర్మించి పద్మనాభుని విగ్రహం ప్రతిష్ఠించాడు. యదువంశానికి సర్వనాశం సన్నిహితమై, ద్వారక జలమయమైపోయినప్పుడు విగ్రహాన్ని కాపాడవలసినదని విగ్రహరక్షణవిషయమై బృహస్పతి సలహా కోరవలసిందని ఆదేశించాడు.

బృహస్పతి వాయుదేవుని సహాయంతో విగ్రహాన్ని ఏసురక్షితస్థలం చేర్చుదమా అని యోచిస్తూ ప్రయాణమై వెడుతూవుండగా పరమేశ్వరుడు తారసిల్లి కేరళదేశానికి గొనిపోవలసినదిగా సూచించాడు.

కేరళదేశంలో శివుడు సూచించిన ఒకపవిత్రస్థలంలో బృహస్పతి ఆవిగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. గురువు (బృహస్పతి) వాయుదేవుని సహాయాన విగ్రహం ప్రతిష్ఠించినస్థలంకనక ఆగ్రామానికి గురువాయూర్ అనేపేరు వాడుకలోకి వచ్చింది.

ఈ కథవిన్న జనమేజయుడు తిన్నగా గురువాయూరువెళ్లి ఆలయంలో ప్రార్థనలుచేసి, కుష్ఠువ్యాధి విముక్తుడై, శ్రీ కృష్ణభగవన్నామ సంస్మరణలోనే కాలంగడుపుతూ ఎంతోకాలం సుఖంగా జీవించాడు.

ఈ పురాణం బహుపురాతనమైనందున దేవాలయంకూడా చాలా ప్రాచీనమైనదనే మనం గ్రహించవలసివుంది.

ఈ గురువాయూర్ దేవాలయాన్నిగురించి వాడుకలోవున్న గాథలను గ్రంథస్థం చెయ్యవలసివస్తే, ఎన్నైనా సంపుటాలు వ్రాయవచ్చు. వీటిలోకొన్ని కేవలం కల్పనా విశేషములేకావచ్చు కాని కొన్నిటికి చరిత్రకూడా ఆధారంగావున్నది. ఈ గాథలను ఆధారంగాగొని చరిత్రవ్రాయడం సాహసమే అయినప్పటికి, అన్నిటినీ కాదని త్రోసివేయడంకూడా అనుచితమేకాగలదు.

చారిత్ర నిదర్శనాలుగల ఒకటిరెండు గాథలనే నేను ఇక్కడ పేర్కొంటాను:-

సంస్కృతంలో నారాయణీయం అనే మహాకావ్యాన్ని రచించి, వాసిగాంచిన మెల్పట్టూర్ నారాయణభట్టాద్రిపాదుడు అతిదారుణమైన కుష్టువ్యాధితో బాధపడుతూవుండేవాడు. అతడు వ్యాధి నివారణకై ఎన్నో ఔషధాలను సేవించాడు. చివరకు తన ఇల్లువదలిపెట్టి ఈ ఆలయంలోనే నివసించసాగాడు. క్రమేపి భట్టాద్రిపాదుని వ్యాధి తిరుగుముఖంపెట్టి ఆరోగ్యంకలుగసాగింది. దానితో తనజీవిత శేషాన్ని అతడు ఆ ఆలయంలోనే గడపివేయ నిశ్చయించుకొన్నాడు.

ఒకనాడు వుదయం అతడు ఆలయప్రాకారంలో ప్రదక్షిణాలు చేస్తూండగా ఒక నంబూద్రి చేతిలో చిన్న కట్టతో వెంబడించాడు. భట్టాద్రిపాదుడు స్వభావతః ముక్కోపి. అహంభావపూరితుడు. గురువాయూరప్పన్‌కు తానే ప్రియభక్తుడనని; తానే గీర్వాణభాషాకోవిదులలో అగ్రేసరుడనని విర్రవీగుతూవుండేవాడు. తన్నుఅనుసరించివస్తున్న నంబూద్రినిచూసి అతడు తీక్షణంగా 'ఏంకావాలి?' అని ప్రశ్నించాడు. నంబూద్రి జంకుతూ "నేను గురువాయూరప్పన్‌పై ఒక గేయం రచించాను. దానిలో ఏవైనాతప్పులుంటే సవరించి ఈయ గోరుతాను" అన్నాడు.

"ఆ రచించినది సంస్కృతంలోనా మళయాళంలోనా" అని భట్టాద్రిపాదుడు అడుగగా మళయాళంలోనని నంబూద్రి బదులుచెప్పాడు. "అయితే మరెవరినైనా ఆశ్రయించు; సంస్కృతంతప్ప అన్యం నేను చూడబోను" అని అతడు అన్నాడు. ఆశాభంగంపొంది, ఖిన్నుడై ఆ నంబూద్రి వెళ్లిపోయాడు. అది మొదలు భట్టాద్రిపాదుని శరీరం తిరిగి రోగపీడితం కాసాగింది. ఒళ్ళంతామంటలు హృదయంలో తీరని ఆవేదన ప్రారంభమైనాయి. స్వామీ, ఏమి ఈ అవస్థ అని అతడు విలపించినాడు. తుదకు స్వామి స్వప్నంలో ఒకబాలునిరూపాన సాక్షాత్కరించి "నీ అహంభావంకంటె నాకు ఆ నంబూద్రి వినయవిధేయుమైన భక్తే తృప్తినిచ్చినది. లే, వెళ్లి అతనినూరడించు" అన్నాడు.

భట్టాద్రిపాదుడు ఆలయానికి పరుగెత్తి స్వామిగర్భగుడిఎదుట తన తాళపత్ర గ్రంథముతో గుండెలు వ్రయ్యలౌనట్లు ఏడుస్తూవున్న నంబూద్రిపాదాలపై పడ్డాడు. దుఃఖంమానమని బ్రతిమాలి, ఆ రచన సంస్కరించాడు. ఇప్పటికీ పూర్వం నంబూద్రి విరచితమైన శ్రీ కృష్ణవిలాసమనుపేర, ఆరచన ఎంతో ప్రఖ్యాతి పొందింది.

## మరొక గాథ

ఆ ఆలయానికి ఒక వృద్ధుడు పూజారిగావుండేవాడు. అతడు, భార్య, ఏడెనిమిదేళ్ళ ప్రాయంగల కుమారుడు, బీదవారైనప్పటికీ ఆదంపతులు రోజూ తాము వండుకొన్న భోజనపదార్థములను స్వామికి

నివేదనలిచ్చి దానినే భుజించి కాలంగడుపుకొనేవారు. ఒకనాడు ఆపూజారి గ్రామాంతరం వెళ్ళవలసివచ్చి నైవేద్యభారాన్ని చిన్నకుమారునిపై పెట్టి ప్రయాణమైనాడు. ప్రయాణానికిముందు "నాయనా! నైవేద్యాన్ని దేముడు తింటాడా" అని కుమారుడు అడిగాడు. స్వామిముందు, ఆ నైవేద్యంవుంచి తలుపులుమూసివేస్తే తప్పకుండా స్వీకరిస్తాడని తండ్రిచెప్పాడు. ఆమాటలునమ్మిన బాలుడు నైవేద్యాన్నితీసుకొని ఆలయానికివెళ్ళి విగ్రహంముందుంచి తలుపులు చేరవేసి కొన్నినిముషాలైనపిమ్మట తిరిగిచూడగా అది అలాగేవుంది.

బాలుడు కలవరపడ్డాడు—భగవానుడు ఆ నివేదనను ఎందుకు భుజించలేదాఅని సంశయించాడు. బహుశా కూరగాని, పచ్చడిగాని లేకపోవడంవల్లనా వట్టిఅన్నాన్ని తినలేక ఊరుకొన్నాడేమో అనుకొన్నాడు. అటు ఇటు కలయజూచాడు. దగ్గరలోనే ఫలసంభరితమైన ఒక చూతవృక్షాన్ని జూచాడు. రెండుపళ్ళు పుటుక్కునలాగి, ఒకచిన్నపెంకులో వాటినిచీల్చి ఇంటికివెళ్ళి కొంచం వుప్పుతెచ్చి, ఆపళ్ళ ముక్కలను కొబ్బరిచిప్పలోపెట్టి స్వామిముందుంచాడు.

"ఆరగించు! తండ్రీ ఆరగించు. ఆరగించకపోతె నాయన నన్ను కొట్టగలడు" అని ప్రార్థించి తలుపులు మూశాడు. కొన్నినిమషాలై తిరిగిచూస్తే పళ్లెంలో నైవేద్యంలేదు. వేళ మించిపోతున్నప్పటికి తనయుడు ఇంటికిరానందుకు తల్లి కలవరపడ్డది. సంతోషంతో పొంగిపోతూ బాలుడు ఇంటికివెళ్ళి జరిగినదంతా చెప్పాడు. ఆమె నమ్మలేదు. "ముందు మన భోజనమాటేమి?" అంది. పిల్లవాడు అబద్ధాలాడుతున్నాడని తలంచి భర్తరాగానే చెప్పింది. ఆ నైవేద్యాన్ని ఎక్కడనో పారవేసిగాని, ఎవరికోఇచ్చివేసిగాని వుంటాడని పూజారిఆగ్రహించి, కొడుకును చావగొట్టి ఆ రాత్రి పస్తుపడుకోపెట్టాడు.

బాలుడు దేవుని ప్రార్థించాడు. ఆప్రార్థనను గురువాయూరప్పన్ ఆలకించాడు. రాత్రి పూజారి కలలో చిన్నబాలునివలె స్వామి ప్రత్యక్షమై బాలుడుచెప్పినది అక్షరాలా నిజమన్నాడు. తండ్రి నిర్భరానంద వివశుడై కుమారుని బుజ్జగించాడు. ఇవి నిజమైనా కాకున్నా ఇప్పటికీ కొబ్బరిచిప్పలోనే మామిడిపళ్ళు నివేదన జరుగుతూవుంది. అదిమటుకు సత్యం.

ఈ సందర్భంలో రెండు మూడుమాసాలక్రితం జరిగిన ఒకసంఘటనను ఉదహరించడం అప్రస్తుతం కానేరదు. అప్పుడప్పుడు సంపన్నులైనవారు ఆలయంలో సప్తాహాలు చేయించడంకద్దు. ప్రసిద్ధులైన పండితోత్తములను రప్పించి భాగవతపఠనం పూర్తిచేయించడమే సప్తాహం తాత్పర్యం. పండితులకు సముచిత ప్రతిఫలం ఇవ్వబడుతుంది. అనేకులు వినడానికి వస్తూవుంటారు.

ఒకసారి సప్తాహం జరుగుతూవుంది. ఏడవరోజున ఒక వృద్ధ బ్రాహ్మణాంగనవచ్చి "ఫలానవారేనా, ఈ సప్తాహం చేయిస్తున్నది? ఫలానవారేనా" అని అడిగింది. అక్కడనున్నవారు ఔను! నన్నారు

"నాకు నిన్నరాత్రి కలవచ్చింది. ఫలానవారు అక్కడ సప్తాహంచేయిస్తున్నారు. రేపు కడపటిరోజు వెళ్ళి పిల్లలకూ అరటిపళ్ళు పంచిపెట్టించు. నూరురూపాయలు ఖర్చుపెట్టు. కోరికలన్నీ తీరుతవి" అని ఒక బాలుడు చెప్పినట్లయింది. ఇదిగో నేను ఆపైకం తీసుకొని వచ్చాను" అంది.

## ఆలయం చరిత్ర

ఆలయభవనాలు 200 ఏళ్ళకంటె పూర్వానివై వుండవని తోస్తుంది. పశ్చిమగోపురద్వారందగ్గర ఒక శిలాశాసనం కనిపిస్తుంది. క్రీ. శ. 1747 ఏప్రిల్‌లో కార్యకర్ పనిక్కవీటిల్ ఇత్తిరారిచమీనన్ పర్యవేక్షణలో ఆ గోపురనిర్మాణం పూర్తిఅయినట్లు శాసనం సూచిస్తుంది.

తూర్పుగోపురందగ్గర ఒకరాతిపైన సంస్కృతశ్లోకంలో గోపురం క్రీ. శ. 1842 లో కాలికట్ జామొరిన్ రాజా నిర్మించినట్లు వర్ణించబడియున్నది.

1790 వ సంవత్సరంలో టిప్పుసుల్తాన్ దండయాత్రజరిపినపుడు కొంతభాగం శిథిలమైవుండవచ్చు. 1842 లో జరిగినది మరామత్తులే అయి వుండవచ్చుకూడా. ఈ శిలాశాసనాలవల్ల దేవాలయ ప్రాచీనతను నిర్ణయించడానికి అంత అవకాశం కాదు.

గుడి బహు పురాతనమైనదికావడంవల్ల ఈ గోపురాలనిర్మాణం ఆ తర్వాతనే జరిగివుండవచ్చు. ఇటువంటి ఆలయాలవిషయంలో కొన్ని కొన్ని భాగాలను పునర్నిర్మించేటప్పుడు ఇతరభాగాలలోని శిలలను, వాటిపైవున్న వ్రాతకోతలను లక్ష్యపెట్టక ఉపయోగించడం అసహజంకాదు, కాగా వాటిపరిశీలనలో మనం జాగ్రత్తవహించడం అవసరం.

## నిత్యపూజలు

ఆలయంలో నిత్యపూజలవిషయమై శ్రీ శంకరాచార్యులవారు స్వయంగా కొన్నిఏర్పాట్లుచేశారని అంటారు. వేకువ నాలుగుగంటలకు ఆలయంద్వారాలు తెరుస్తారు. పూజాతత్పరులైనవారు అనేకులు ఈ సమయంలోనే వస్తారు, తొలిరోజు అలంకరణను తొలిగించకుండా జరిగేపూజను చూడడంకోసమే ఎంతో ఉత్సాహంతో వస్తారు. దానిని నిర్మాల్య దర్శనం అంటారు.

అలంకరణాలు తీసివేసినపిదప విగ్రహాలను నువ్వులనూనెతో అభ్యంగనంచేయించి కసిందనూనెతో శుభ్రపరుస్తారు. దానికి 'వాకచార్తు' అంటారు. ఈ నువ్వులనూనెను ప్రసాదంగా పంచిపెడతారు. దానిలో అపూర్వమైన ఔషధగుణాలు వుంటవని అంటారు. ఆ తర్వాత ఉషాపూజ ఉదయం ఏడుగంటలకు జరుగుతుంది. దానికి పిమ్మట ఉత్సవవిగ్రహాన్ని ఏనుగుపై మహావైభవంగా ఊరేగిస్తారు. ప్రభాతభేరీలు అయిన ఒక గంటకు అభిషేకం జరుగుతుంది. ఈ అభిషేకానికి తొమ్మిది రజితపాత్రలలోని జలం వుపయోగిస్తారు. కనుకదానిని 'నవకం' అంటారు. తదుపరి పదిగంటలకు పంతీరటి పూజ జరుగుతుంది. ఆలయ ద్వారాలు మధ్యాహ్నపుపూజానంతరం సుమారు 12 గంటలకు మూసివేస్తారు.

సాయంకాలము ఆరుగంటలకు తిరిగి తెరుస్తారు. మళ్ళా ఊరేగింపు జరుపుతారు. తర్వాత దీపారాధన రాత్రి తొమ్మిదిగంటలకు పూజచేసినపిమ్మట అష్టగంధ ధూపసమర్పణతో పూజాకలాపాలు ముగుస్తవి. ఈ తుదిపూజాకలాపానికి 'త్రిపుక' అనిపేరు. నిర్మాల్యదర్శనం, మధ్యాహ్నపూజ, త్రిపుక - ఈ మూడింటికి ఎంతో ప్రాధాన్యం ఇస్తారు.

## ఉత్సవాలు:

విపరీతంగా జనం వచ్చే వుత్సవాలు కార్తిగమాసంలో (నవంబర్ - డిశంబర్) జరుగుతాయి. ఇవి మండలోత్సవాలు. 41 రోజులు జరిగే ఈ ఉత్సవాలసందర్భంలో చందనగంధంలో విగ్రహాలను అభ్యంగనం చేయించి ఆ గంధాన్ని మరుచటిదినం ప్రసాదంగా పంచిపెడతారు. ఈచందన గంధాభ్యంగనాన్ని కల్పాభిషేకం అనికూడా పేర్కొంటారు.

ఈ 41 రోజులలోనే గురువాయూర్ ఏకాదశికూడా వస్తుంది. ఈ ఏకాదశినాడు సమస్తవర్ణాల ప్రజలుకూడా ఆలయానికివచ్చి పూజలుచేస్తారు.

చిత్రమాసంలో అమావాస్య వెంటనే ప్రారంభమయ్యే వైశాఖంలోమళ్ళీ అమావాస్యవరకూ కూడా ఉత్సవాలు జరుగుతవి. ఫిబ్రవరి - మార్చి నెలలలో 10 రోజులపాటు మరోవుత్సవం జరుగుతుంది.

## పరిపాలన

కాలికట్ జామెరిన్‌రాజా ఈ ఆలయానికి ట్రస్టీగావుంటూ, దీని కార్యకలాపాలు అన్నీ చూస్తాడు. నల్లిసేరి నంబూద్రిపాద్ సహాయట్రస్టీ. పైన మద్రాసు దేవాదాయాలబోర్డువారి పరివేక్షణ. ఆలయానికి మలబార్‌లో ఎంతో ఆస్తివుంది. ఈ భూమినుంచి సుమారు లక్షరూపాయలు ఆదాయంవస్తుంది. దీనికి తోడు భక్తులు అర్పించేద్రవ్యం మరో లక్షరూపాయలుంటుంది. సనాతనాచారాలకు ప్రసిద్ధకేంద్రమైన మలబారులో ఆలయంవుండడంచేత, దేవాలయంలో హరిజనప్రవేశానికి ఆదిలో కొన్ని ప్రతిబంధకాలు ఏర్పడినవి కాని తుదకు వారికి కూడా ప్రవేశం కల్పించబడింది.

ఆలయం చిన్నదే అయినప్పటికీ ఇంత మహిమోపేతమైన కోవెల మరొకటిలేదని మలబార్‌లోని సమస్త హిందువులు విశ్వసిస్తారు. ఇటీవల దేశంలోని ఇతరప్రాంతాలనుంచి కూడా ప్రజలు ఈ ఆలయ సందర్శనానికి వస్తున్నారు. ఎవరి ప్రార్థనలైనా ఇక్కడ వృధాగాపోవు. రోగగ్రస్తులకు ఆరోగ్యం, కష్టశోకవ్యాకులితాత్ములైనవారికి మనశ్శాంతి లభించే పుణ్యస్థల మిది అని నొక్కిచెప్పవచ్చు.




చిన్నమాంబా ముద్రాలేఖిని

శ్రీ సూర్యారాయ తెలుగు టైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూటునందు ఉపయోగింపబడుచున్నది.

# ప్రేమ

శ్రీమతి కమలాకుమారిగారు

పెండ్లికిఁ దద్వధూవరుల ప్రేమరసప్రసృతుల్ ప్రధానమో!
గొండ్లికి సత్కళావతి యకుంఠితభావకృతుల్ విధానమో!
పండ్లకు వానివాని రుచిభారము మోదమొ! కాదొ! నేర్చియే
యిండ్లకు నేని నింతులకు నేని హితంబొ! ప్రియంబొ! సేయుమా!

ఆమైత్రుల్ ఘటియిల్ల శాశ్వతముగా నాంతర్యకార్యభ్రమల్
నేమంబంచు దలంచుటంచితమె! కాసీకాననౌ కన్యకా
కామోద్భూత నివాతవర్తనములే కల్లోలసంసారదు
స్సీమాభూమియటన్న సత్యపదమిస్సీ! యెంచి లక్షింపరే!

ప్రేమాధారవివాహసూత్రములకై విక్లిన్నభిన్నక్రియల్
ఏమీ జంకక నాచరింపఁదగునే హేలాక్రియార్భాటమై?
ప్రేమన్ వేదిలకించి మంచిఁగని నారీలోక చూడామణుల్
ప్రేమావశ్యకతన్ మతిన్ దలఁచి సంప్రీతార్థ సంపన్నలౌ.

యువకులు మోహవాహన బహూకరణంబున సంతసింత్రుఁగా
ని, వివిధకష్టనష్టములు నెత్తికిఁ దాఁపను జింతసేయర
ట్టి వనితయున్నరుండును వడిన్నరక ప్రతిమానభీతిచే
దివులువడున్ గదా! యకట! దేహము ప్రేమకు ద్వారమౌటచే.

దానవిడాకులన్నయది దాఁపగుఁగాని యశోవిశేషసం
తానవిభాసితుల్ సతులు నాదగు భారతవారిజాక్షులీ
న్యూనతమోతురే? భళిర! యుద్ధతివచ్చిన కారణంబు లే
కే నయహీనకృత్యముల? కీటకరూపవిమోహదాహమీ
మానుగ దంపతుల్ కలహమార్గమువీడఁగ జేయునెంచుచో.

యువకుని రూపుతో యువతియున్ యువతీముఖశోభనంబుచే
యువకుఁడు బద్ధమోహమున నొక్కట ప్రేమయనన్ భ్రమించు నౌ
ర! వివిధశీలసంపద పరస్పరచిత్తనిగూఢ సంశ్రయో
త్సవకృతిఁ బ్రేమయంచు వసుధన్ దలపోయరదేమి వింతయో!



—:o:—

# దీపావళి జ్యోతి

"నెమలి"

ఆరోజు దీపావళి. ఊరంతా పండుగయే. ఎటుజూచినా టపాకాయలు 'పటపట' మనుచు 'ధాం ధాం' మనుచున్నవి. ప్రతియింట్లోనూ చిన్నపిల్లలూ, పెద్దపిల్లలూకలసి ఆటలేమి? పాటలేమి? ఇక వారి సంతోషానికి, యుత్సాహానికీ, మేమేం తీసిపోయ్యామన్నట్లు చిచ్చుబుడ్లు చిట్లుమంటూ, తారాజువ్వలు ఝుస్సు బుస్సుమంటూ, ఆకాశానికి గంతులేస్తున్నాయి. ఎటుజూచిననూ ఆనందసాగరములో మునిగి తేలువారే! అదేమి చిత్రమోకాని, ఆ ఊరిబయట మౌనంగా కూర్చున్నవారెవరు? ఇంకెవరు? మనదేశంలో సంఖ్యకుమీరి పెరిగిపోవుచున్న ఆ నిరుపేదలలో ఒక కుటుంబస్థులేవారు! పాపము ఆకాశంలో మినుక్ మినుకనుచున్న ఆ నక్షత్రాలుదప్ప మరెవ్వరూ వారిని గమనించరుకదా! రండి బాలలూ దగ్గరకుపోయి చూతము వారెవరోమరి. అదిగో, ఒకమ్మ తనచేతిలో చిట్టిపాపను పట్టుకొని జోలపాడ్తూంది, తనకుతెలిసిన మూనిరాగంలో. పాపం! దాని కండ్లమ్మట యెలా నీళ్లుకారుతున్నాయో. అబ్బ! అదిపడేకష్టాలేమిటో? ప్రక్కనే ఓ చిన్నమ్మాయి యెలా చలికిలబడిందో కాళ్లూ చేతులూ కదలించకుండా. ఆ అమ్మాయి చలిలో వడకిపోతున్నా కప్పుకోందుకు చిఱిగిన పేలికన్నా లేదు. ప్రక్కనేకూర్చున్న తన అన్నతో యేమిటో మాట్లాడుతూంది. బాలా! విందామా? "అన్నా యీపొద్దు దీపావళికదూ! మరి నాకప్పచ్చులు, టపాకాయలూ తెచ్చావా?" పిచ్చిపిల్ల! పాపం వాళ్ళన్నెక్కడనుంచి పట్టుకొస్తాడు? అయినా, అతడేం చెప్తాడో విందాం.

"ఇదో తెస్తాగా. మరేం నలుగురింటికాడకెళ్ళి పట్టుకొస్తానమ్మా. నువ్వూతిందువుకాని." ఎంత అమాయకుడతను. అడగంగానే పెడ్తాగో? అదో ఆ అమ్మతో ఏదోచెబుతున్నాడు. 'అమ్మా, నేనెల్లి చెల్లికి అప్పచ్చులు పట్టుకొస్తానే. నీవూ అదీ యీడే వుండండి. అనిచెప్పి లేచాడు. ఇటూఅటూ బారజూచి గబగబా వూరివైపు నడవడం మొదలెట్టాడు.

అతడు నడిచివెళ్ళేలోగా మనమూ కనబడే యింటిలోజొరబడి, ఓ మూలదాగుండి ఏంజరుగుతుందో చూద్దాం. ఆయింటి తిన్నెమీద యెంతోచక్కగా దీపాలు వెలిగించారు. ఇల్లంతా లక్షదీపాలతో కలకళ్ళాడుతోంది. ఆ యరుగుమీదే యిన్ని టపాకాయలుపేర్చి యిద్దరుపిల్లలు నవ్వుకుంటూ కాలుస్తున్నారు. ఓఅమ్మాయీ, ఓఅబ్బాయీని, వాళ్ళమ్మ వెనకేనుంచుని జాగ్రత్తగా కనిపెడుతూంది. మరి వాళ్ళ నాన్నేమో పెద్దచిచ్చుబుడ్లూ అవీ కాలుస్తూ వారికానందం కలిగిస్తున్నాడు. ఎంత రమ్యమైనదృశ్యం! కాని ఆగు బాలా! ఆ తలుపు మెల్లగా తోసుకుంటూ లోనికివచ్చేదెవరు? అవును. చెల్లితో టపాకాయలు తెస్తానని చెప్పివచ్చిన అబ్బాయే! పాపం! వాడు వచ్చిందికూడా అక్కడివారెవరూ గమనించలేదు. అతడేమో యీ మధురదృశ్యం చూస్తూ తనచెల్లిని తల్చుకొని మెల్లగా కండ్లనీరుకార్చాడు. తరువాతెట్లో ధైర్యంతెచ్చుకొని మెల్లగా తండ్రిదగ్గరకువెళ్ళి "బాబుగారూ"! నాచెల్లి ఆకలితో ఏడుస్తూవుంది, కొద్దిగా బువ్వపెట్టించండి బాబుగారూ అని దీనంగా బ్రతిమాలాడు. ఆయన గ్రుడ్లురుముతూ తలపైకెత్తి 'ఛీవెధవా! అవతలికిపో! ముష్టిముండావాడు తలుపుతోసుకుని ఎలావచ్చేశాడో. పోతావా లేక టపాకాయలు మీద పేలవనా? జాగ్రత్త! బువ్వట, బువ్వ!" టపాకాయలు పేలలేదన్నకోపమూ అమాయక బాలునిమీదనా చూపడం? ఈ ఎదురుచూడని బదులువినగానే ఆబాలునిగుండె చివుక్కున్నది. మరి మాటలాడలేక తలుపుతీసుకొని జారిపోయాడు.

ఇదంతా చూస్తూవున్న యిద్దరుపిల్లలూ యిలా మాట్లాడుతున్నారు.

అమ్మాయి:- ఏంరా! ప్రసాద్, మననాన్న యెలాచేశాడో చూశావా? పాపం వాడిచెల్లెలు ఆకలితో ఏడుస్తోందట. మనమేంచేద్దాంరా?

ప్రసాద్:-వూరుకోవే శారదా! నువ్వెందుకలా ఏడుస్తావు? అమ్మ చూస్తే కోప్పడుతుంది. నువ్వు గట్టుగా వెళ్ళి అమ్మ దాచుంచిన అప్పచ్చులు పట్టుకరా. అవీ, కొన్నిటపాకాయలూ సంచిలోవేసి. తీసుకెళ్ళి ఆ అబ్బాయికిచ్చొస్తా. ఇంకేడవకు శారదా! వెళ్ళు మరి.

ఈ మాటలువినంగానే శారద తనకన్నీరు తుడిచేసుకొని లోపలకు పరుగెత్తింది. ఇంతలోకి వాళ్ళ నాన్న, అమ్మా భోజనానికి వంటయింట్లోకెళ్ళారు. శారద ఓ పెద్దసంచినిండా అప్పచ్చులుతీసుకొచ్చి తన అన్న చేతికిచ్చింది. అతఁడు టపాకాయలు చేతిలోపట్టుకొని బయటకు పరుగెత్తాడు. శారద వాళ్ళమ్మతో ప్రసాద్ ప్రక్కింటి రామంపిలిస్తే వెళ్ళేడనిచెప్పి తాను వాకిటిలోనే కూర్చుంది అన్నవస్తాడని. ప్రసాద్ చేతిలో సంచిపట్టుకొని యిటూఅటూ చూస్తూ అన్నిసందుల్లో వెళ్ళాడుగాని, ఆపిల్లాడుమాత్రం కనబడ లేదు. నిస్పృహతో తిరిగి వచ్చేస్తుంటే తనయింటిదగ్గరే ఆ అబ్బాయి నిలుచోడంచూచి పరుగెత్తుకుంటూ వెళ్ళాడు. కాని పాపం! సగందూరం వచ్చాడోలేదో రెండుమూడు పెద్దటపాకాయలు బుస్సు బుస్సు మంటూ భయంకరంగా వచ్చి అతనిమొహంమీదా గుండెమీదా పేలాయి. వొళ్ళంతా మండుకొని పోతూంది. 'అమ్మా! శారదా!' అని కేకలేస్తూ తన్ను రెండుచేతుల్తో గట్టిగాపట్టుకొన్న అబ్బాయి ఒడిలో మూర్ఛపోయాడు. తనమీదమంటలన్నీ అబ్బాయి చిఱిగినగుడ్డలకూ అంటుకొన్నాయి. కానీ ఆ అబ్బాయి ప్రసాదును అలాగేపట్టుకొని, తనదేహంకాలుతున్నా లక్ష్యపెట్టక, అతడ్ని మోయలేకమోస్తూ, యింటివాకిట్లో నివ్వెఱపోయికూర్చున్న శారదప్రక్కన పండబెట్టాడు.

ప్రసాద్ సంచిపట్టుకొని వెళ్ళినకొంతసేపటికల్లా వారినాన్నగారు బయటికొచ్చి, టపాకాయలు కాలవడం మళ్ళీ ప్రారంభించారు. ' ఓ కొత్తరకం టపాకాయ పెట్టిలోనుండితీసి, శారదవైపుతిరిగి, "అమ్మణ్ణీ చూశావా! యీ టపాకాయను. ఇవి రెండుమూడు ఒకేసారి భయంకరధ్వనితో పేలుతాయి! అని చెబుతూ వాటినిముట్టించారు. మరుక్షణం వీధినుండి 'అమ్మా! శారదా!' అన్న కేక. అవును, అయిదు రూపాయల టపాకాయలతో తనకుమారుని చంపుకున్నాడా దౌర్భాగ్యుడు! ఇదివిన్నశారద, "ప్రసాద్!" అని అఱచుచూ అలాగే చతికిలబడింది. అదో మండుతున్నదేదో వస్తున్నదిలోపలికి; ఆదిగో ఆ అబ్బాయి ఎవర్నో మోసుకొస్తున్నాడు. తన అన్నే! అబ్బా! నాన్న యలాపిచ్చివాడులా నుంచున్నాడు? మంట లార్పరాదూ. పాప మాఅమ్మాయి లోపలికెళ్ళి రెండురగ్గులనుతెచ్చి మంటలమీద వేసింది. అప్పుడే నాన్న పరుగెత్తుకుంటూవచ్చి యిద్దరినీ వాటిలోచుట్టి మంటలార్పేశాడు. కానీ ఏమిలాభం! మెల్లగాకండ్లుతెఱచి "నాన్నా...రూ - రూ - సంచి...ఆ...అ...అబ్బాయికివ్వండి. మన...యింట్లో... వుండమనండి. మళ్ళీ శారదా...దా... ఏడవకూ - నేను_వెళ్తున్నా... మళ్ళీ...కలుసుకొందాం - దీపావళొచ్చిందమ్మా... అని చెప్పుతుండగానే ఆ చిన్నబాలుని ప్రాణములెగిరిపోయినవి. బీదకుఱ్ఱాడు బ్రతికాడు. ఇంటిలోని దీపాలన్నీ యొక్కపెట్టున తీక్షణముగా వెలిగి అన్నీ కొండెక్కాయి. దీపావళి వచ్చింది. ఆకాశంలోని నక్షత్రాల్లో మరియొక చుక్కకూడా చేరింది. మినుక్ మినుకంటూ యీ యింటివారినీ, ఏటిగట్టు మీది వారినీ చూచి ఓదారుస్తున్నట్లు కనబడింది. దీపావళివచ్చింది. దీపావళి వెళ్ళింది. దీవపాళి! జీవితజ్యోతిని బలిగాగొన్నది!



# తాజ్ మహాల్

ఘనకీర్తిన్నిను షాజహాను నృపుఁడుం గట్టించెనో తాజ! ని
న్ననుజూడంగ విదేశవాసులును, ఎన్నోకష్టముల్ బొందివ
చ్చి నినుంజూచిన లోచనద్వయము సుశ్రీయుక్తిఁ
జెన్నొందు నం
చును బల్కన్ వినుచుందు; తాజమహాలా!
క్షోణిక్ విరాజిల్లుమా!

అందముగా నిన్ను యమునా నదీతీరమునను గట్టించెఁగా
మొఘలురాజు
తనభార్యపేరను దాజమహాలనుచు ముద్దుగాఁ బెట్టెను
మొఘలురాజు
చలువరాతినిగట్టి విలువైన మాణిక్యములను స్థాపించెఁగా
మొఘలురాజు
నీపేరు స్థిరముగా నిల్చునట్టుగఁ జేసి భూరియశుండయ్యె
మొఘలురాజు

యూరపు నివాసులుం గూడ దూరదేశ
మైననుం జూడవచ్చి, ధన్యతనుజెంది,
మహినిఁగనలేదు యిటువంటి మహాలునంచుఁ
బలుక, యతిశయోక్తి కలదె వాక్యమందు?
తెచ్చితివి పేరు భారతదేశమునకు
దివ్యతాజమహాల నీకిదే జోహారు!

తనికెళ్ల సన్యాసమ్మ,

# ఆధునికస్త్రీకి ఆంగ్లవిద్యాఫలితాలు

శ్రీమతి ఉప్పులూరి కుసుమకుమారిగారు.

ఆధునికస్త్రీకి ఆంగ్లవిద్యవల్లఏమీ ప్రయోజనం కనుపించటములేదు. వివాహ మయినతరువాత వారిడిగ్రీలు వారికేమీ ఉపకరించకపోగా సంసారము దిద్దుకొనుటకును ఏమీ పనికిరావటంలేదు. తలితండ్రులు వివాహమయ్యేవరకు ఏస్కూలుఫైనలువరకో ఇంటర్మీడియేటువరకో, మంచిసంబధం కుదరకపోతే బి. ఏ, బి. ఎస్ సి. వరకో చదివిస్తారు. ఇందులోవారికి వారి పిల్లల భావిజీవితాన్ని గురించి ఏమీ ఆలోచనవున్నట్లుతోచదు. పైగా ఇప్పుడుజరిగే వివాహాలకు క్వాలిఫికేషన్సులో బాగా ఇంగ్లీషు విద్యవచ్చి వుండటము ఒకటి. పెండ్లికొడుకులు కూడా ఆచదువును చూస్తేమోజుపడి చేసుకొంటారు. కానితరువాత ఆవిద్యనిష్ఫలం అయిపోగా గృహజీవితానికి ఏమీ ఉపయోగంగాలేదని తెలుసుకుని ఏమీ చెయ్యలేక సంసారంలో పూరకే చికాకులుపడటం ప్రారంభిస్తారు. ఈ ఇంగ్లీషుచదువుకునే పిల్లలకు ఆచదువుతప్ప మరి దేనికీ అవకాశం వుండదు. అందువల్ల వారు వంటలోగాని, కుట్టుపనులలోగాని, తదితరమైన చేతిపనులలోగాని ఏమీతర్ఫీదై ఉండరు. సరే, యిక బిడ్డలశిక్షణ విషయమై అసలే తెలియదుగదా?

నిజానికి ఆంగ్లవిద్యస్త్రీలకి ఎంతవరకు అవసరం, ఎవరికి అవసరం అని మనం ఆలోచనచేయాలి. అంతేగాని గుడ్డిగా ఏదోచదివిస్తే ఎలాగు? కొందరు స్త్రీలు వుంటారు. వారికి అసాధారణమైన తెలివితేటలు వుంటాయి. వివాహం ఆవిద్యకు, ఆమేధస్సుకు ఆటంకం అని అనుకొన్నప్పుడు వారు వారిజీవితాన్ని ఆప్రయత్నానికే ధారపొయ్యాలి. అంటే డాక్టర్లుగాగాని, ఇంజనీర్లుగాగాని చదువవచ్చును. నిజానికి ఇప్పుడు స్త్రీజనోద్ధరణ, అనాధశిశురక్షణ చేయడానికి ఆడ డాక్టర్లు కావాలి. ఉపాధ్యాయినులుకూడాకావాలి. వీరివల్ల ఎంతో దేశోపకారం జరుగుతుంది. ఇంక తక్కినవారు వారివారికి ఏకళయందు ఎక్కువ అభిరుచి ఉంటుందో దాన్ని అభివృద్ధిచేసుకోవాలి. ఊవృధా ఆంగ్లవిద్యమానేసి ఆకళలలో కృషిచేయాలి. అలాచేసిననాడా మనదేశంలో కూడా గొప్పచిత్రలేఖినులు, గాయకురాండ్రు, నర్తకులు అభివృద్ధిచెందుతారు. ఇవికాక సాధారణవిద్యలో ఆంగ్లము చదవటం, వ్రాయటం, మాట్లాడటం నేర్చివుండాలి. రెండుమూడుభాషల్లో ప్రవేశంవుండాలి. ఉదా: తెలుగు, హిందీ, సంస్కృతము మొదలైనవి.

గృహమే స్త్రీకి స్వర్గము. బిడ్డలే అమృతాన్ని రుచిచూపించే దేవతలు. భర్తయే దైవము. అటువంటి గృహమును త్యజిస్తే స్త్రీకి ఏమీ ఆనందంలేదు. కాబట్టి అది స్వర్గసీమగా చేసేందుకు ప్రతి స్త్రీ ప్రయిత్నంచేయాలి. దీనికి కావలసినతర్ఫీదు

వివాహాత్పూర్వమే తలితండ్రులు యివ్వాలి. ప్రతిబాలికా వంట, కుట్టుపని, (తనజాకెట్లు, పిల్లలగౌన్లు, అయినా స్వయంగా కుట్టుకోడమురావాలి) బట్టలు ఇస్త్రీచేసుకోటం, ఇంటికికావలసిన నూనెలు, పళ్లపొడి, అత్తరువులు, సబ్బులు స్వయంగాతయారు చేయడం అన్నీ నేర్చివుండాలి. రకరకములైన ఆహారపదార్థాల్ని ఇంపుగాచేయడం నేర్చి వుండాలి. ప్రతిదానికీ బజారుమీదే ఆధారపడివుండకూడదు. ఈరోజుల్లో వస్తువుల, ధరలు అమితంగా పెరిగిపోయాయి. కుట్టుపనివాళ్లకిచ్చేది, చాకలివాళ్లకిచ్చేది తగ్గించి తనే చాలమట్టుకుచేసుకుని, ఆకర్చు తగ్గించి పొదుపుచేయాలి. కూరగాయలు, పండ్లు పండించటం నేర్చివుండాలి. నిజానికి ఇంటగెలిచే కదా, రచ్చగెలవాలి. మీటింగులు, క్లబ్బులు, వార్తాపత్రికలు, దేశోద్ధరణ అన్నీ వీటితరువాతే కదా ?

ఈవిధంగా ఆదర్శంగావుండేవాళ్లు నూటికిద్దరైనా వున్నారా? అనుమానం. ఏదో తప్పనిసరిగా ఇంటిపనులు నిర్వహించుకోడం, తీరికసమయాల్లో వృథా ప్రసంగమో సినిమాలోతప్ప.

కాబట్టి సోదరీమణులారా ఇప్పుడేమీ, మించిపోయిందిలేదు. ఇప్పుడయినా ఇవన్నీ నేర్చుకొని ఇంటిని మనోరంజకముగా చేసి ఆపైన దేశవ్యవహారములను చూచుకొనుడు.

---

# మంచి ఆహారమే - ఆరోగ్యకరము, పుష్టికరము

"రాము"

మనచేతలు, తలపులు మనము తినేతిండిమీద ఆధారపడగలవని పరిశోధనలు తెలుపుచున్నవి. మంచి ఆహారమెట్టిదని వెదకుటకు ఇదొక ప్రబలకారణము.

శరీరనిర్మాణము, వివిధావయవములు పనిచేయువిధము, ఆహారద్రవ్యముల రసాయనిక సంఘటనము, వివరముగా, ఈ రోజు తెలియును కాబట్టి కొంతవరకు దేహమునకెట్టి ఆహారము అవసరమో చెప్పవచ్చును. "శరీరములో మాంసమేర్పడుటకు మాంసకృత్తులు, బలము, వేడి కలిగించుటకు క్రొవ్వు, పిండిపదార్థములు, నీరు, లవణములు, విటమిన్లు ఆహారములోఉండి తీరవలయును. కాబట్టి మిశ్రమాహారము భుజింపవలెను" అని మనము తెలిసికొనుచున్నాము. అయితే, విటమిన్లు మొదలయిన వాటినిగూర్చి తెలియని మనపూర్వులు పుష్టికరములయిన ఆహారములు తినుచుండలేదా? ఎట్టి ఆహారము తినవలయునని వైజ్ఞానికులు నిర్ణయించు అవసరమేమున్నదను సందేహము కలుగవచ్చును. ప్రకృతిలో కావలిసిన పుష్టికరమయిన ఆహారమున్నది. నాటి మానవులు, జంతువులవలెనే పరిసరములలో లభించిన ఆహారము తినువారు. ప్రకృతినే నమ్మియుండిన వారి కేలోటు తిండిలో నుండెడిదిగాదు ఈనాడో మనకు ప్రకృతిని వెక్కిరింపగల శక్తియున్నది.

మనము ఆహారము ప్రకృతిలో దొరకినరీతిగా భుజింపము. తిండిపదార్థముల నిల్వగావించుట అభివృద్ధియయిన ఈ నాడు మానవుడు పరిసరములపై నాధారపడి యుండనక్కరలేదు. ఎప్పుడు, ఏతిండి కోరినను లభించును. జీవితములో కృత్రిమము పెరిగిపోయిన ఈ రోజుల్లో ఏ తిండి మంచిదో, ఏ పండు తినవలయునో తెలిసికొనుట చాలఅవసరము.

స్కర్వీ (Scurvy) (శీతాదము) రికెట్సు (Rickets)అనే రోగములగూర్చిన పరిశోధనలు 'సి' మరియు 'డి' విటమిన్లను బయలుపర్చినవి. ఇదేమాదిరిగా బెరిబెరి (Beri beri)అను జాడ్యము ఆహారలోపములచేగల్గునని కనుగొనబడెను. కోళ్లకు మరబియ్యము మాత్రమే తినిపించి పెంచిన బెరిబెరీ వంటిరోగము వచ్చునట. లోపించిన ఆహారసత్వము విటమిను 'బి' యనియు, అది తవుడులోనుండునసియు 1906 లో డాక్టరు ఇజికమన్‌చే విశదముగావింపబడెను. పరిశోధనలు, ఆహారములో విటమిన్లు లోపించిన స్కర్వీ, బెరిబెరివంటి వింతరోగములు వచ్చునని తేల్చినవి.

మొదట విటమిన్లు ఇట్టివి అనిచెప్ప వీలుగలగలేదు. పలువురు వాటిని నమ్మలేదు. కొందరు అవేవో ప్రాణులని భావించేవారు. ఈనాడైనను మనకు నాలుగే విటమిన్లు స్ఫటికములుగా లభించుచున్నవి వాటియొక్క రసాయన స్వరూపము మనకు ఎఱుకపడినది.

ఈ నాటికి ఎ, బి, సి, డి, ఇ, యఫ్, జి, హెచ్, కే అను తొమ్మిది, పది విటమిన్లు గలవని తెలియుచున్నది.

1906-1913 సంllలలో క్రొవ్వులు, పిండిపదార్థములు, మాంసకృత్తులు మొదలయినవన్నీగలిగిన సంపూర్ణాహారముతో పెంచిన ఎలుకలు సరిగా ఎదుగక పోవుటేగాక కృశించి పోవుచుండెను. వాట్టికి కావలసిన పదార్థము కోడిగ్రుడ్లలోను, కాడ్ చేపనూనెలోను లభించెను. ఇదే విటమిను 'ఎ'. ఇదొక క్లిష్టమయిన రసాయన పదార్థముగా నిర్ణయింపబడినది. పచ్చ ముల్లంగి (Carrot) లోని మూడురకముల కరోటిన్ (Carotene) అను పదార్థము, క్రిప్టోక్సాంతిన్ అనునది జంతుదేహములో విటమిను 'ఎ' గా మారునట. కాబట్టి ఈ విటమిను కొరకు పచ్చ మొక్కలు, వాటిని పరోక్షముగాతిని జీవించు సముద్రపు చేపలు ఈ విటమిను కలిగియుండును. షార్క్, కాడ్ మొదలయిన చేపల కాలేయపు నూనెలలో

'ఏ' విటమిను అధికముగా దొరకును. ఇదొక చిక్కని పసుపుపచ్చనూనె. ఇది రసాయనికముగా అంగారము, ఉదజని, ఆమ్లజనులచే చేయబడినది. ఇది శ్వాసకోశములకు, నరములకు, జీర్ణావయవములకు చైతన్యము, ఆరోగ్యము కలిగించును. సంతానాభివృద్ధికి, నేత్రారోగ్యమునకిది అవసరమట.

మనము వెలుతురులోనుండి చీకటిని ప్రవేశించినపుడు, నేత్రాంతఃపటలము (Retina) చీకటినలవాటు చేసికొనగలదు. 'ఏ' విటమిను ఒక మాంసకృతుచే సంయోగము నొందుటచే కంటిలో Visual purple అను పదార్థ మేర్పడుచున్నది. ఇది లేకపోయిన రేచీకటి (night blindness) కలుగును.

విటమిను 'బి' ఆరేడు రకములున్నవి. 'బి' అనునది నీటిలో, సారాయిలో కరగునది. ఇది థయమిన్ హారిదము (Thiamin chloride) అను రసాయన ద్రవ్యము. ఇది బియ్యపు తవుడులో, పాలలో, గోధుమ గింజలలో, ముల్లంగిలో, క్యాబేజిలో, నారింజ మొదలయిన పళ్లలో, యీస్టు (Yeast)లో లభించును. ఇది లోపించిన ఆహారము తినువారికి 'బెరిబెరి' రోగమువచ్చును. ఈ వ్యాధిగలవారికి పక్షవాతము, కాళ్లు దేహము వాచుట, హృదయ దౌర్బల్యము, నరముల క్షీణత లక్షణములు.

విటమిను 'బి' అనునది రిబోఫ్లావిన్ (Riboflavin) అను పసుపురంగు పదార్థము. ఇది వెంట్రుకలు బాగాపెరుగుటకు అవసరమట. దీనిని విటమిను 'జి' యనికూడ పిల్చెదరు. దీనినిగూర్చి ఎక్కువ తెలియదు.

ఇంకొకరకపు 'బి$_2$ పి-పి విటమిను' అనుపేరుతో పెల్లాగ్రయను రోగము రానీయకుండుట కవసరము. ఈ వ్యాధివల్ల జీర్ణశక్తి నశించి చర్మమంతయు వ్రణమయమగును. ఈ విటమిను పొగాకునుండి తయారు చేయబడును.

విటమిను 'సి' నిమ్మ, కిత్తలి పండ్లలోను, ద్రాక్ష, టొమటో పండ్లలోను దొరకును. దీనికి అస్కార్బి క్కామ్లము (Ascorbic acid) అని పేరు. ఇదిలోపించిన స్కర్వీ (Scurvy) లేక రక్తపిత్త రోగము వచ్చును. దుర్బలత, రక్తనాళములు పగిలిపోవుట, చిగుళ్లవాపు మొదలయినవిరోగలక్షణములు.

చిన్నపిల్లలు రెండుసంవత్సరములయిన నిండకమున్నే రికెట్సు (Rickets) అను రోగముచే పీడింపబడు చుందురు. పొడవు ఎముకలు లావగుట, వంకరదీరుట, అజీర్ణము, లివరు పెద్దదగుట ఈవ్యాధి లక్షణములు. ఈవ్యాధినివారించుటకు విటమిన్ 'డి' అవసరము. చర్మపు క్రిందిభాగమున ఎర్గోస్టిరాల్ (Ergosterol)అను పదార్థముండును. పాదరసపు ఆవిరి దీపము (Mercury vapour lamp) నుండిగాని, సూర్యరశ్మినుండిగాని ప్రసరించు అతినీలలోహిత కిరణములు ఎర్గోస్టిరాల్ పై బడినపుడు, అది విటమిను 'డి' గా మారును. ఇట్లు తయారయిన 'డి' విటమినుకు 'క్యాల్సిఫెరాల్ (Calciferol)' అని పేరు. ఇది ప్రకృతిలో కాడ్ లివర్ నూనెలో, ఆవు పాలలో, మేకపాలలో, కోడిగ్రుడ్లలో విరివిగామన్నది.

దేహమునకు విటమిను 'డి' తక్కిన ఆహారసత్వములలోగూడ అవసరము. కాని పెరుగుదల ఆరోగ్య ముగానుండుటకు దేహములోని వాహికావిహీన గ్రంథులు (Ductless glands) కొన్ని సరిగా పని చేయుట అవసరము. ముఖ్యముగా ఉపకాకళములు, పోషణిక గ్రంథులు (Parathyroid and Pituitory-glands) 'డి' విటమినుతో సన్నిహిత సంబంధముగలవి.

విటమిను 'ఇ' నిగూర్చి అధికముగా పరిశోధన జరుగవలసియున్నది. సంతానప్రాప్తికి, పుంస్త్వము నకు 'ఇ' మరియు 'ఎ' విటమిను ఆవశ్యకములు. వీటికి వృక్కాగ్ర గ్రంథుల (Suprarenal glands) కు సంబంధముండవచ్చును. ఇవి మొలకెత్తు గోధుమలలో దొరకును.

విటమిను 'కే' స్త్రీలు ప్రసవించుటకు మునుపు వారి ఆహారములో కలిపియుండిన వారి శిశువుల దేహమున రక్తము, గడ్డకట్టుకొనుశక్తి అపరిమితముగా కలిగియుండునట. శిశువు తల్లి గర్భమునుండి

బయటపడునపుడు, మెత్తని పుఱ్ఱెపై ఒత్తిడి గల్గుటచేత శిశువు మెదడునుండి రక్తస్రావము కలుగుటచేత చనిపోవుట కలుగవచ్చును. ఇట్టి రక్తస్రావము, రక్తమును గడ్డ కట్టించుటచే మాన్పునది ఆహారసత్వమయిన విటమిను 'కే'.

విటమినులగూర్చిన విజ్ఞానము చాలవరకు ఎలుకలు, పందులు మొదలయిన వాటిపై పరిశోధనలచే లభించినదే. కాబట్టి ఈ శాఖ ఇంకను అసంపూర్ణమే. అదీగాక మనము విటమిన్లుగల ఆహారద్రవ్యములు తినవలెనేగాని కృత్రిమముగా తయారు గావింపబడిన విటమిన్లు మ్రింగుట ఉత్తమముగాదు. స్వచ్ఛముగా తయారయినపుడు రసాయన ద్రవ్యములయిన విటమిన్లు, ఇన్సులిన్, అడ్రినాలిన్ మొదలయిన గ్రంధిరస ద్రవ్యముల (Hormones) వలెనే చాల స్వల్పము పుచ్చుకొన్నను అపరిమితముగా అతిత్వరలో పనిచేయును. కాబట్టి ఆహారమునందు కృత్రిమము అవసరములేదు; ఆహారము మందువలె రుచిలేకయుండ నవసరములేదు. పాశ్చాత్యులవలె మనము తిండిలో ఖనిజములు, విటమిన్లు ప్రత్యేకముగా చేర్చుకొననవసరములేదు.

విటమిన్లు మొదలయిన ఆహారసత్వములపై పరిశోధనవలన ప్రకృతి లభ్యమగు ఆహారములపై మన శ్రద్ధ మరలుచున్నది. ముఖ్యముగా తియ్యనిపండ్లు నారింజ, ద్రాక్ష, కిత్తలి, టొమటోపళ్లు శ్రేష్టమయినవి. అంజూర, అరటి, మామిడి, దానిమ్మ, సపోటా మొదలయిన పళ్లుగూడ తినదగినవి. కొబ్బెర ఎక్కువగా వాడదగిన పదార్థము. వేరుసెనగయొక్క ఆహారపు విలువగూర్చి నేడు చాల వింటున్నాము. పాలకు బదులుగా సోయా (Soya beans), వేరుసెనగపప్పులనుండి తీసినపాలు, వాడుప్రయత్నములు జరుగుచున్నవి.

దంపుడు బియ్యము, గోధుమలు, రాగి పూర్వమువలెనే వాడవలెను. పాశ్చాత్యులు నానరొట్టె తిను వారుగాబట్టి వారు గోధుమ పొట్టుతో, తవుడుతోచేబడిన బిస్కత్తులు వేరుగాతినెదరు. మెంలకకూర, గోంగూర, తోటకూర, పొన్నగంటి, గుంటకలగర, సరస్వతి, బచ్చలి, చుక్కకూర మొదలయినవి దోస, బెండ మొదలయిన కూరకాయలు, ముల్లంగి మొదలయిన దుంపలు మన ఆహారములో యుండవలెను. పాలు, వెన్న, పెరుగు, నేయి సాధ్యమయినవరకు వాడవలెను.

స్వాభావికమయిన ఆహారమును మరియు రుచులను వదలి కృత్రిమాహారము అలవడజేసికొనుట మనకు పాశ్చాత్య నాగరికతనుండి ప్రాప్తించినదే. కాని పాశ్చాత్యులేనేడు మన పూర్వుల మార్గము చేరుచున్నారు. కాబట్టి విజ్ఞానమువల్ల చక్కని ఆరోగ్యము, శక్తి కొంత యత్నముతోనే సంపాదింపగలము.

# సైరంధ్రి

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

(జూన్ నెల సంచిక తరువాయి)

కురుపతియుం బితామహుఁడు కూఁడదటం చెరికట్టి గట్టిగాఁ
బరసదనంబునన్ బలికి భగ్నమొనర్పఁగ నెంచియున్న నే
కరణి సుయోధనుండు సమకట్టును జూదమునాఁడ; గౌరవే
శ్వరుఁడె యనుజ్ఞనీక తెగఁబల్కిన బెట్టిద మింత పుట్టునే?

తెలుపఁగరాదే భీష్ముఁడు
కులకాంతను గొల్వు కీడ్వఁ గూడ దటంచున్ ?
బలుకఁడు ధృతరాష్ట్రుఁడు కొడు
కుల చెయ్దము లాలకించి కుత్సితమతియై !

తనపలు కాదరింపనివిధంబు నెఱింగెనొయేమొ; కాక యం
ధనృపతి లోభి తత్సుతు డధర్మపరుం డభిమాని యంచో; శాం
తనవుఁడు ధర్మపద్ధతి యదార్థము వల్కఁడు; పల్కియున్న య
జ్జనపతి వల్వలొల్వ నెటుసాలును; గుండియ లెన్నిగల్గెడిన్ ?

పాపిచతుష్టయం బొకటఁ బట్టుగఁ జేసెడి దుష్ప్రయత్నమున్
బాఁపఁ గడంగి భీష్ముఁడును బల్కెను ధర్మయుతంబుగాఁగ జూ
పోరమి కూడదంచు మరి పొందొనరించుట మేలటంచుఁ;
దానా పలుకాదరింపఁడు వినాశపుఁ గాలము దాపురించుటన్.

తగురీతి యెఱుఁగ జెప్పెను
దగవును ధర్మంబురీతి తండ్రియెదుటఁ; దా
వెగటుగఁ బెడచెవిఁ బెట్టెను;
మగుడన్ గినియుచు జెప్పి; మానండయ్యెన్.

సన్నిపాతజ్వరంబుచేఁ జచ్చువాని
కెటులు శైత్యోపచారంబు లింపు గూర్చు;
భీష్ముఁ డెఱిగించు ధర్మార్థవిధు లవెల్ల
ములుకులై తోఁచి వినఁడాయె మూర్ఖుఁడపుడు.

మదమునఁ గండ్లు గాన కభిమానము పేర్మి వినండు గాని యా
విదురునకన్నఁ జెప్పెడి వివేకి గలండొకొ! యామహాత్మునిన్
సదయునిఁ జీరికిన్ గొనెనె? జాల్మని సన్నిధిఁ బండితోక్తు లె
ట్లాదవును; ధర్మమార్గవిధి నుత్తము సూక్తులు రిత్త వోవునే?

విదురుఁడు, భీష్మ, ద్రోణులు
నెదఁ బాండవపక్షపాతు లెపుడనుచు వా
రిదెస ననాదర మూనుచుఁ
బదిలంబుగ వినఁడు వారిపలుకుల నెపుడున్.

ఏటికి భీష్మద్రోణుల
మాటికి మాటికిని దూర మాలిఖితం జే
నాఁటికి నేగతి గల్గ దా
నాఁటికి నారీతి జరిగె నంతియ గాదే!

భుజబలంబుగ గెల్వనో భూపతులకుఁ
గాక మాయల గెల్తురే కాలమహిమ
ధర్మమే జయమందురు తత్వవిదులు;
గాని మాపట్ల నదియును గల్లయయ్యె.

పుడమి నాకన్నఁ గష్టముల్ వడిన వారె
గలరు దమయంతి మొదలుగాఁ గాంత లెల్ల;
గాని సభలోన దాయాది వాని చేత
నీడ్వఁబడి రొక్క సిగఁబట్టి యింతులెందు?

పరమపతివ్రతామణియుఁ బల్వుర బిడ్డల గన్నతల్లి భూ
వరునకు పత్ని యేమనగవచ్చును ధర్మమెఱుంగదయ్యెనే?
తరుణియు నేకవస్త్రయగు దానిని కొల్వున కీడ్చుచుండగాఁ
గరగడు పుత్రుదూర; దిటుగాదన దాధృతరాష్ట్రరాణియున్.

ఎంత కడుపాత్రమో గాక యెంతదుడుకు
చెయిదములఁ గాంచి సైరింపఁ జాలుటెట్లు?
ఒక్కపరి గాక యున్న వేరొక్క తరిని
బుద్ధిసెప్పదుగా తల్లి పుత్రకునకు?

జూద మాడఁ బిల్వఁ జూచుచు నుండెను ;
గొలువు కీడ్చు తరినిఁ బలుకకుండె !
వలువ లొల్చు తరిని గలగక పతి చెంత
నిలిచి యుండె నెంత నిబ్బరంబొ !

కొడుకు మహాప్రగల్భతను గొంకక కొప్పెడఁబట్టి యీడ్చుచో
నుడుగు మటంచు నడ్డుపడి యుండిన పుత్రుఁడు తల్లిమాటలన్
బెడచెవి బెట్టి యుండునొకొ ; పెద్దలు సైతము మౌనముద్రచే
నుడుపక చూచుచున్న నెటులుండును ధర్మము ధారుణీస్థలిన్ ?

కాదే రాజకుమారిత ?
కాదే కురురాజపత్ని ? కడుపారఁ గనన్
లేదే బిడ్డల ? మది దయ
రాదే ? యాహృదయ మెట్టి రాయో ! యినుమో !

ధారుణి రాజకాంతలకు ధర్మము యార్తులఁగాచుటంచు నేఁ
గ్రూరుఁడు దుస్ససేనుఁడును గొప్పెడఁ బటఁగవచ్చుచో మహా
భీరువ నొచు నత్తయని పెద్దగఁజేసి మరుంగుసొచ్చినన్
జేరఁగదీయదాతనయు, ఛీయనికోయదు సుంతయేనియున్.

(సశేషము)

# లోకవార్తలు



రోమ్ (ఇటలీ రాజధాని) పట్నంలో సెంట్-పీటర్స్ చర్చి ఉన్నది. అందులో మధ్యగోపురం లోపల అంచునెక్కి ఎవ్వడో యొక అనామకుడు క్రిందికిదూకి చచ్చిపోయినాడు, ఇదేచర్చిలో సం॥ క్రింత వేరొకడు పిస్తోలుతో కాల్చుకొని చచ్చినాడు.

* * *

ఇండోరు మహారాజావారు అమెరికన్ యువతిని వివాహమాడియున్నారు. వారి కొక కుమారుడు. ఆ మువ్వురు నివసించడానికని అమెరికాలో 20 ఎకరముల ఎస్టేట్ కొన్నారు.

* * *

1948 లో జరిగిన ఒలింపిక్ పోటీపందెములను 16 వివిధభాషలలో ఫిల్ముదీసి ప్రపంచమంతటికి ప్రచారమునకై పంపినారు. ఇది రంగులచిత్రము. ఇందులో పాత్రలు ప్రపంచం నాల్గుమూలల్లనుండి వచ్చిన 6000 పందెగాండ్రు.

* * *

ఇప్పుడు ప్రపంచములోగల రహస్యములలోకెల్ల పరమరహస్యము - ఆటం శక్తినిగూర్చిన విశేషము. ఇటీవల లండన్‌లో ఆటం రహస్య పరిశోధకశాస్త్రజ్ఞుల సంఘమువారు కొంత చర్చసాగించినారు. ఆచర్చ ప్రత్యక్షరము - వ్రాతలోనుంచబడినది. ఆ రిపోర్టు నెవ్వరో దొంగిలించారు. అచటి స్కాట్లండుయార్డ్ సర్వీస్ అనే రహస్య పోలీసుదళమువారు దానికై దర్యాప్తు చేయుచున్నారు.

* * *

ఆంగ్లేయులు వర్తకపుజాతిఅని లాలా లజపతిరాయిగారన్నారు. ఇటీవల బ్రిటిష్‌దీవులకు వచ్చివెళ్లిన పరదేశీయులు ఆదేశంలో రు 532400000 లు ఖర్చుపెట్టినారట. అందులో - వారు కొనుగోలుచేసిన సరుకు ఖరీదు రు 92200000 లు. బంగారు పళ్లెములు మొదలు గోల్ఫుఆడే కర్రలవరకు అన్ని సరుకులు కొన్నారట.

* * *

ఈజిప్టు రాజు ఫరూక్‌న్నూ, రాణీ ఫరీదాయున్నూ విడాకులుపుచ్చుకున్నారు. రాణివయస్సు 27 సం॥ లు. ఆ దంపతులకు ముగ్గురుబిడ్డలు. వాళ్లవయస్సులు వరుసగా 10, 8, 5 సం॥ లు. కడపటిపిల్ల తల్లివద్ద ఉంటుందట, మిగతఇద్దరు తండ్రివశమట. రాణి తన పూర్వనామధేయమును - మదాం సఫీనాజ్ జుల్‌ఫికర్ - అని ధరించినది; రాజశాసనానుసారం. రాకుమార్తెలతర్వాత స్థానమును పొందుతున్నది. రాణి రాజభవనం వదలిపెట్టి - తండ్రియింటికి చేరినది. ఆమెకు ప్రత్యేక భవనమేర్పాటయ్యేదాకా అక్కడే ఉంటుంది. వెలలేనినగలు, భూములు ఆమెకే వదిలేశాడు. ఈజిప్టులోగాని, ఇతరత్రాగాని నివసించడానికి అనుమతినివ్వబడినది. ప్రస్తుతం ఈజిప్టులోనే ఉంటున్నది.

* * *

గతమాసం 16 వ తేదిని శిఖులమరమున ఉపన్యసించను వెళ్లినప్పుడు నెహ్రూ ఆచారానుసారం తొడుక్కొన్న క్రొత్తజోడు బయట విడిచి లోపలికివెళ్లినాడట. ఉపన్యాసమై తిరిగీ వచ్చేసరికి ఎవ్వరో తన పాతజోడు నక్కడ ఉంచి-నెహ్రూ క్రొత్తజోడు తొడుక్కొని ఉడాయించారట! అయినా, నెహ్రూ కాలిజోళ్లలో కాళ్లుపెట్టను ఎవరికి ధైర్యం వచ్చిందీ?

* * *

వాలెన్షియాప్రిభ్వీ - స్పెయిన్‌లో రాజవంశం తిరిగీ పరిపాలనకు రావలననే ఆందోళకులకు చెందిన ఆమె. ఈసంవత్సరారంభములో ఆమెకు 1 సం|| శిక్ష బడినది. రెండునెలలున్నపిదప - అనారోగ్యంగా ఉన్నదని ఈజూన్‌లో ఆమెను విడుదలగావించినారు. ఆ ఆందోళనకే చెందిన ఒకకుర్రవాడు జైలులో చావగా ఆతని అంత్యక్రియలకు ఆమె హాజరైనదని - తిరిగీ అరెస్టుచేసినారట.

* * *

బ్రిటన్‌లో మ్యాజిస్ట్రేటులుగా నియమింపబడిన 500 మంది తమ ఉద్యోగధర్మములు సక్రమంగా జరపడమెట్లాగో నేర్చుకోడానికి "పాఠశాల" కంపబడుచున్నారు. ఈపాఠశాలలో కొన్ని ఉపన్యాసముల ద్వారా తమవిధులను వారు తెలుసుకొంటారు.

* * *

మృగాలకుకూడా శస్త్రచికిత్సచేస్తారుట. ఇటీవలనే న్యూజిలాండులో ఒక సర్కసులోని ఆడ సింహానికి ప్రసవకాలమందు శస్త్రచికిత్సచేసి - మూడుసింహపు పిల్లలను వెలికితీశారు. పాపమాపిల్లలు చచ్చే పుట్టాయట, సింహముకూడా మరి నాలుగురోజులకు చచ్చిపోయింది.

* * *

ఇటీవల లండన్‌లో సమావేశమైన 100 ఇంజనీర్లు, గణితశాస్త్రజ్ఞులు, విద్యార్థులు చంద్రమండలాని కెళ్లిరావడానికి ఉపాయాలను ఆలోచించారు. వారి నక్కడికి తీసుకెళ్లు విమానములో రేడియోవగైరాలన్నీ ఏర్పాటు చేయగలరట. గాలి, నీరు, ఆహారం అన్నీ సప్లైఅవుతాయట. ఈ 100 మందిలో ఇద్దరు స్త్రీలూ ఉన్నారు.

* * *

ఆమె ఎంత పతివ్రతయోచూడండి. ఆమెభర్త 20 సం|| లనాడు - ఒక త్రాటితో ఉరిపోసుకొని ఆత్మహత్య చేసుకొన్నాడు. ఆమె ఆత్రాడు భద్రంగా జాగ్రత్తపరచి, నిజసంకల్పానుసారం - సరిగా 20 ||సం లు గడవగానే అదేరోజున, అదేఘడియన, అదేత్రాటితో ఉరిపోసుకొని చచ్చింది. ఎల్లరికి తెలియగలందులకు ఈ విషయం కాకితముమీద వ్రాసియుంచింది. ఆమెది ఇటలీదేశం.

* * *

కిరస్తానీ ఆదిపీఠమువారు కిరస్తానులు విమానములో ప్రార్థనలు చేయడానికి అనుమతించారు.

* * *

చేతిగడియారం సైజులో రేడియోసెట్టులు తయారు చేయవచ్చు అని కనిపెట్టినారు.

* * *

న్యూయార్క్‌లో ఎవరో పెద్దమనిషి ఒక బస్సును దొంగిలించి 5 గం||లసేపు యథేచ్ఛగా ప్రయాణీకుల నెక్కించుకొని తిరిగి ఆ డబ్బు జేబులో వేసుకొని మాయమైనాడట. పోతూ పోతూ ఊరుకో లేదు. ఆ బస్సును రెండు టాక్సీలమధ్య ఇరికించి సందులోకి తప్పుకున్నాడు. పోలీసు లతని జాడల వెతుకుతున్నారు.

# సామెతలు

358. తోచీతోచనమ్మ తోడికోడలు పుట్టింటికి వెళ్లినదట.
359. మాటలు కోటలు దాటుతై, కాళ్లు గడపలు దాటవు.
360. పెట్టిన వారికి పుట్టుచేసాక్షి.
361. రాజునిచూచిన కంట మొగుణ్ణిచూస్తే మొట్ట బుద్ధి ఐందిట.
362. గుణంమానవె, గూటాలకొరివీఅంటే, మను మన్నా మానుతాను కాని, గుణం మాననందిట.
363. గ్రుడ్డొచ్చి పిల్లని ఎక్కిరించిందట.
364. ఉత్తముండకంటె, అత్తముండ మేలు.
365. పెట్టనిఅమ్మ పెట్టనే పెట్టదు, పెట్టేముండకేం ఒచ్చింది పెద్ద మాయరోగం అని.
366. వుండ్రాళ్లూ ఒక పిండివంటేనా, మేనత్త కొడుకు ఒక మొగుడేనా?
367. పిల్లకాకేమి తెలుసురా వుండేలుదెబ్బఅని.

పోపూరి రాజేశ్వరి

368. పోలి తక్కువని గుడ్డిబాన్ని పెండ్లాడితే, దొంతికుండలు పగలగొట్టింది.
369. బొల్లుల మొగుడు బొగడలు చేయిస్తే అప్పల మొగుడు అమ్ముకు తిన్నాడు.
370. అంతనాడులేదు ఇంతనాడులేదు, సంతనాడు పెట్టింది ముంతంతకొప్పు
371. చుట్టమైవచ్చి దయ్యమై పట్టుకుంది.
372. మింగటానికి మెతుకు లేదు. మీసానికి, సంపెంగనూనె.
373. తన కూటికి దారిలేదు, తనవారికి తద్దినాలు.
374. రామునినాడులేదు భరతునినాడు లేదు; శత్రుఘ్నునినాడు చెవులపోగులన్నట్లు.

ఎమ్. ఏ. పూర్ణావతి.

375. పిల్లికి చెర్లాటము, ఎలుకకు ప్రాణసంకటము.
376. తెలివొకరిసొమ్మా సొలెబసవమ్మా.
377. సూరన్నసుఖవాసి, పేరన్న పెద్దవాడు అయ్యకెత్తరా కోళ్లగంప.
378. తానుబట్టిన కుందేటికి మూడే కాళ్లు.
379. ఆడపోయిన తీర్థం ఎదురైందిట.
380. అయ్యవార్ని చెయ్యబోతే కోతైంది.
381. ఆలశ్యం అమృతం విషం.
382. దొంగిలపోయిన మంగలం యెదురే.
383. కన్నంలో దొంగను తేలుకుట్టినట్లు.
384. తాటిచెట్టు ఎందుకెక్కావురా — అంటే దూడ మేతకన్నాడు.
385. గుజ్జుమల్లెకుక్కను పెంచి రెడ్డి తానె మొరిగాడట.
386. నా యింటికి నేనే పెద్దను. పిల్లికి పెట్టరా పంగనామాలు.
387. తిన్నయింటి వాసాలు లెక్కపెట్టాడు.
388. యింటి దొంగను ఈశ్వరుడన్నా పట్టలేడు.
389. కవళమంటె నోరుతెరిచి, కళ్లెమంటే నోరు మూస్తె యెట్లా?
390 చెవుడు పెద్దమ్మ చాంతాడంటె, మా అమ్మ పుట్టిల్లు బెజవాడ.
391. తిన్నమ్మ కేతీపి, ఉన్నమ్మ కేవాపి.
392. పులినిచూచి నక్కవాత పెట్టుకున్నది.
393. అక్కభాగ్యంచూసి చెల్లెలుచెయ్యివిరగ బడ్డది.
394. మొక్కైవంగంది మానై వంగుతుందా?

పులిపాక బాలాత్రిపుర సుందరమ్మ

395. అభ్యాసం కూసువిద్య.
396. అడ్డాలనాడే బిడ్డలుగాని గడ్డాలనాడు కారు.
397. అంగట్లో అన్నివున్నాయి, అల్లునినోట్లో శని వున్నది.
398 అరవైవూళ్లకు ఆములుదారు, ఆలికి దాసుడు.
399. ఆకలి రుచియెరగదు నిద్ర సుఖమెరగదు.
400. అంగిటిలో బెల్లం, ఆత్మలో విషం.
401. అత్తమీదకోపం దుత్తమీద చూపింది.
402 యిల్లు యిరకాటం, ఆలుమరకటం.
403. కోడలు గృహప్రవేశం, అత్త అగ్నిప్రవేశం.
404. ముప్పైయేండ్ల మగవానికి, మూడేండ్ల ఆడది.
405. చిత్తం శివునిమీద, భక్తి చెప్పులమీద.

(సశేషము)




**డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు యునైటెడ్ నేషన్స్ ఎడ్యుకేషన్ అండు సైన్సు శాఖయందుపన్యసించుచు నిట్లనిరి:—**

భారతదేశము వివిధజాతుల సమానత్వము కోరుచున్నది. విద్యావిషయమున వెనుకబడిన దేశముల అభివృద్ధికొరకై ఆర్థిక నిర్మాణమునకు, ధనసహాయమునకు తగిన సమగ్రమైన ప్లాను తయారుచేయుడనియు, ఇందుకై ధనవంతమగు దేశములు తగినంత ధనము ప్రత్యేకించునట్లు ప్రోత్సహించుడనియు యునెస్కో వారికి భారతప్రభుత్వమువారు సూచించుచున్నారు. భూగోళశాస్త్రరీత్యా, విజ్ఞానపరముగా యోచించి ఆయాదేశములకు సమానముగా పంచుడని కోరుచున్నాము. అరబ్బీ, హిందూ, చైనా విజ్ఞానములకు ప్రాతినిధ్యము వహించు ఆసియా, ఆఫ్రికా ఖండములు మేల్కాంచినవి. అయితే ఈ భూభాగములనుండి ఒక్క తలర్పైనను, యునైటెడ్ నేషన్సుయొక్క ఈ ప్రత్యేక వ్యవహారములలో కన్పించకపోవుట జుగుప్సాకరము.

**భారతయూనియన్ గవర్నర్ జనరల్ శ్రీమాన్ చక్రవర్తి రాజగోపాలాచారిగారు సిమ్లాలో మ్యునిసిపల్ కాలేజీకి ప్రారంభోత్సవము జరుపుచు స్త్రీ పురుషుల సాహచర్యమునుగూర్చి ఇట్లుపన్యసించిరి:—**

ప్రస్తుతముకన్నా తరుచుగా స్త్రీ పురుష లొండురుల కలుసుకొనుచుండవలయును. ఎవరికివారై మసలుట శ్రేయస్కరముగాదు. స్కూళ్లలోను, కాలేజీలలోను మాత్రమేగాక పరస్పరము కలిసిమెలిసి తిరుగు నవకాశముగల ప్రదేశములనంతటా మనము కలుసుకొనుచుండవలయును. అట్లాకలుసుకోకుండా ఉండుటచేతనే మనకు కష్టములు ఎక్కువగుచున్నవి.

**బహుచర్చనీయాంశమైయున్న బ్రిటిష్ భారతదేశముల సంబంధమునుగూర్చి రష్యాలో భారతరాయబారి, ప్రధాని నెహ్రూచెల్లెలు, శ్రీమతి విజయలక్ష్మీపండిట్ పారిస్ నగరంలో ఇట్లు చెప్పినది:—**

బ్రిటిష్ కామన్‌వెల్తునుండి భారతదేశము వేరగుటనే నేను కోరుదును. ఈ విషయమై భారతశాసనసభలో రెండు నెలల్లో నిర్ణయము కానున్నది. కామన్‌వెల్తునకు భారతదేశము వెలియైయుండి, "స్వేచ్ఛాయుక్తమగు సుస్థిరమగు ఆధారముపై" బ్రిటిష్ భారతదేశముల భవిష్యత్ స్నేహము నిర్మాణము కావలసియున్నది. క్రిస్మస్‌లోపలనే ఐర్లండు కామన్ వెల్తునుండి విడిపోవునని ఐరిషుప్రధాని గావించిన ప్రకటన నాకు చాలవరకంగీకారము.

**మద్రాసులో వుమెన్సు వెల్‌ఫేర్ ఆఫీసరు శ్రీమతి పారిజాతం నాయుడుగారు "హిందూ" విలేఖరితో ఇట్లుచెప్పిరి:—**

గవర్నమెంటుబస్సులలో యువతులను కండక్టర్లుగా ఏర్పరిచారని విమర్శించేవారు - నిరుద్యోగసమస్య ఒక్కపురుషుల కాణాచియే కాదని గ్రహించాలి. ఈ నగరంలో, తాము తమకుటుంబాలు సుఖంగా జీవించడానికి, ఏదో ఒక ఉద్యోగం దొరికితేచాలునని తాపత్రయము పడుతున్నవాళ్లు వందలకొలదిగా అర్హులైన

స్త్రీలు ఉన్నారు. ఎంతోమంది స్త్రీలు దరఖాస్తులు చేతబట్టుకొని మా ఆఫీసుకువచ్చి ఏదైనా ఉద్యోగం దొరుకుతుందా అని అడిగిపోతున్నారు. సాధ్యమైనంతవరకూ ఇలాంటివారికి సహాయంచేతామని మా డిపార్టు మెంటువారు ఉద్యోగకాంక్షితుల జాబితావ్రాయను రిజిస్టరు పెట్టినారు. దానిలో వారిపేరు, అర్హతలు నమోదుచేస్తున్నారు. ఇండ్లల్లోగాని ఆఫీసుల్లోగాని ఖాళీఉన్నదని తెలిస్తే-వారికి అర్హమైనవారిని సిఫారసు చేస్తున్నాము. ఇప్పటికే ఈ రిజిస్టరులో చాలామంది తమపేర్లు నమోదు చేయించుకొన్నారు - ఒకసారి ఆ రిజిస్టరుచూస్తే అన్ని కులాలవాళ్లు మతాలవారు కన్పిస్తారు- 15_55 సం॥ల మధ్యవయసువారు అంతా. మచ్చుకు: శ్రీమతి యస్. వయస్సు 53 సం॥ లు, మెట్రిక్యులేషన్ ప్యాసైనది. గుమాస్తాపని కావాలట. జే. కన్య. 24 సం॥లు. స్కూలుఫైనలుప్యాసైనది: టైపుచేయడం తెలును. 2½ సం॥ ల సైనికశాఖలో పనిచేసినది. ఎక్కడన్నా టైపిస్టుపని కావలెనట. 17 సం॥ ల బాలిక: 2 వ క్లాసువరకే చదివినది; ఎక్కడన్నా ఆయాగా ఉంటానంటుంది. ఏపరీక్షలివ్వనివారెంతోమంది స్త్రీలు, వంటకత్తెలుగాను, గృహనిర్వాహకురాండ్రుగాను, జవానులుగానుఉంటామని వచ్చారు. వీరిలో చాలావరకు, ఏదోచిల్లరఖర్చుకు సంపాదించవలెనని వచ్చినవారుకారు. దాదాపు వాళ్లంతా కుటుంబజీవనార్థం సంపాదించేవారే. ”

ఢిల్లీలో సాంఘికసేవామహాసభ కధ్యక్షతవహించి డాక్టరు. భోగరాజు పట్టాభిసీతా రామయ్యపంతులుగారిట్లు ఉపన్యసించినారు:-

సాంఘికసేవ అడుగునుంచీ ప్రారంభంకావాలి, పైనుంచికాదు. ప్రస్తుతప్రభుత్వము పూర్వప్రభుత్వమువలె కేవలము అనుపాజ్ఞలు అమలుజరుపునట్టిదే కాదు. సాంఘికసేవచేయడముకూడా దానికిఅగత్యము. బ్రిటిష్‌వారు వర్తకులుగవచ్చి, తమ ఆస్తికాపాడుకోను సోల్జర్లుతెచ్చినారు. వానివెంట మిషనరీలువచ్చి, అయాచితంగానే మనదేశంలో సాంఘికసేవ చేయనారంభించారు. ఇప్పుడావర్తకుడు, ఆసోల్జరు ఇండియా వదలిపెట్టి వెళ్లిపోయినాడు: ఇంకా మిషనరీలు వెళ్లలేదు. ఎన్నాళ్లుఉంటారో తెలియదు. ఇప్పుడు మనమే వారుచేస్తూఉండిన సాంఘికసేవనిర్వహించను నడుముకట్టవలెను. సాంఘికసేవ చేసేవారికి సానుతాపము, సమన్వయము ఉండవలెను. వారి విద్యావిధానమందుకనుగుణ్యంగా మారవలెను. నేడు పట్టభద్రులయ్యే యువతీయువకుల కెంతమందికి ఆ సానుతాపము, సమన్వయముకలదు? బాధితుల అంతస్థులోనికి తామునుదిగి వారికి కష్టములనుంచి తొలగుటకు ఎంతమందిసహాయపడగలరు?. ”

ఫిల్ము సమీక్ష: “ద్రోహి”

“స్వతంత్రా ఫిల్మ్స్”, వారు తామిటీవలతీసిన “ద్రోహి” చిత్రాన్ని ప్రథమంగా చూపుతూ. ఆహ్వానమంపగా కృతజ్ఞతతో వెళ్లిచూచాము-ఫిల్ము రంగంలో ఇదివరకే మెప్పుగాంచినతారలు లక్ష్మీరాజ్యం, వరలక్ష్మి, ఇందులో ఇంకాబాగా నటించారు. చిల్లరనటీనటులున్నూ బాగానే తమపాత్రలను ప్రదర్శించారు - తారలనెన్నుకోవడంలో చాలా జాగ్రత్తవహించినట్లున్నది; తర్ఫీదుకూడా మరికొంత ఇచ్చి ఉన్నట్లైతే, - నర్సు కాంపౌండర్ల మోటుహాస్యం అంతముదుగా ఉండకపోవచ్చు. గొప్ప ఇళ్లల్లోజరిగే ద్రోహాలు కళ్లకుకట్టినట్లు చేసి_అమాయకపుస్త్రీలకు హెచ్చరికగా ఉండగలదీ చిత్రం.

—0—

# సంపాదకీయములు

## అలహాబాదు—ఎద్దుబండ్లు

అలహాబాదు నెహ్రూల జన్మస్థలము. ప్రథమమంత్రిణి, ప్రథమస్త్రీ రాయబారి, అయిన శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ జన్మస్థలము. శ్రీమతి సరోజినీ నాయుడుగారు గవర్నరుపదవి నలంకరించిన యు.పి. రాష్ట్రమునకది ముఖ్యపట్టణము. అట్టి ప్రదేశము చాలనాగరికమని సహజముగా తలంపబడునుగదా. కాని ఇంకను అచ్చట బాలికలను పాఠశాలలకు గొంపోవునది ఎద్దుబండ్లేనట. ఇది ఆశ్చర్యకరము. ఈ బండ్లపై పాఠశాలలకు వెళ్లు బాలికలు - ప్రొద్దున 9 గం॥ లకు హాజరు కావలసినబడికి - 7 గం॥ లకే బండెక్కినగాని చేరజాలరట. ఇక తిరిగివచ్చుట కంతకన్న తక్కువబట్టునా? ఇంటికిచేరునప్పటికి కెన్ని గంటలపట్టునో? అధునికవిద్యావిధానమున అధునాతనవిజ్ఞానముగ్రోల నువ్విళ్లూరుచున్న - బాలికలు రోజుకు 4 గం॥ లు కటకటలాడుచుపోవు ఎద్దుబండిలో గడపవలసినదేనా మన రాష్ట్రమున విద్యార్థులను పాఠశాలలకు గొంపోయిరాను - మోటారు బస్సులను విరివిగావాడుచున్నారు. ఒక్క మద్రాసులో మిషనరీలు పాలించు కాన్వెంటులకేగాక, ప్రైవేటు మ్యానేజిమెంటుగల, ఛిల్డ్రన్స్‌గార్డన్ స్కూలు, ఆంధ్రమహిళాసభ, మున్నగునవియు నట్టిబస్సుల నుపయోగించుచున్నవి. నెల్లూరున కస్తూరిదేవి బాలికా పాఠశాలయు నొకబస్సునడుపుచున్నది. అలహాబాదువంటి గొప్పపట్నమున ఇంకను ఎద్దుబండ్లలో బాలికలు పాఠశాలలకు పోయివచ్చుచున్నారన్నవార్త, మనదేశమున ప్రచురమగుటయేగాక విదేశములను ప్రచురమగుట, ఇప్పటికే వింత వింత బొమ్మలతో - మనదేశము చాల వెనుకయున్న దేశమని విదేశముల ప్రచారము గావించుచున్న అమెరికావంటి దేశములకు ఇంకను అస్కారమిచ్చినవారమగుదుము. 'నెహ్రూలజన్మస్థలమున స్థితిగతులిట్టివి.' 'విజయలక్ష్మి ఎద్దుబండిలో స్కూలుకువెళ్లి చదువుకొన్నది' అని వారు ప్రపంచమంతయు చాటుదురుగదా. ఈరహస్యము బయటపడుటకు కారణముగా సమ్మెకట్టిన ఆ ఎద్దుబండ్లకు అవకాశము తొలగినదని ఆ రాష్ట్రప్రభుత్వము గ్రహించదగును.

## మద్రాసు మహిళా సభలు

మద్రాసు నగరమున రెండు నగరమహిళా మహాసభలు గతమాసమునందు జరిగినవి. ఇందొకటి ఆంధ్రులదియు, రెండవది తమిళులదనియు తెలియుచున్నది. స్త్రీల సంఘములలోకూడ నీ ఆంధ్ర తమిళముల భేద ముదయించినదాయని మా జుగుప్స. తమిళస్త్రీలకన్నా పొడిచి గెల్తమనిగాక — నూటికి ఏఇద్దరు ముగ్గురో చదువుకున్న స్త్రీల సంఘాభివృద్ధికై పాటుపడు మహాసభలందు మాతృభాషలో వ్యవహారము జరుపు సౌకర్యమునకయ్యే వీరిట్లు ప్రత్యేకసభచేసి యుండినచో అందుకు ఆంధ్రనారీమణుల నభినందింతుము. మనసహాయము అవసరమైనప్పుడు ఇతర స్త్రీ సేవాసంఘముల కొసంగవలయునని వారు తీర్మానించుట చాలసబబైనది. అయితే మా సోదరీమణులను చక్కగా నొక్కవిషయము హెచ్చరించవలసియున్నది. ఇదివరకు ఆంధ్రులలో కొందరు పురుషులే వర్తకసంస్థలలోను మహాసభలలో ఇతరసమితులలోను ప్రజాధనము ప్రోగుచేసినదానికి సరిగా లెక్కడొక్కలుంచరు; చెప్పరు అని పేరుపడసియున్నారు. ఆ కీర్తిని సంఘ సేవ పరాయణులైన స్త్రీలిఖన్న పంచుకొనుట కువ్విళ్లూరుచున్నారాయని మేమీమహాసభా విషయమై అచ్చటచ్చట వింటున్న వార్తలబట్టి మా కనుమానము కలుగుచున్నది. అట్లుకాదని తెలియుటకు మేము

సంతోషింతుము. కాని విరాళములు, చందాలిచ్చినవారే కొందరు తమకు సరియగు అచ్చురసీదులు మట్టి లేదనియు సభజరుగుచున్న సంగతే తెలుపలేదనియు,—ఏమేమో అనుకొనుచున్నట్లు తెలియుచున్నది. ఇట్టి మాటలు పుట్టుట ఏ సంఘమునకైన తగదన్న పోటీగా పుట్టిన క్రొత్తసభకు చెప్పనక్కరలేదు. తమిళులలో వేయిలోపములుండుగాక, వారేదిచేసినను క్రమబద్ధముగ జేతురు. లెఖ్ఖడొక్కలు చూపుదురు, విరాళములన గానే వేలు, లక్షలు నమ్మకముచే కురియును. ఆంధ్రదేశమున కేకైక నాయకుడనబడు ఆంధ్రకేసరి కంచువిగ్రహమునకును 18000/-లు కావలెనంటే 3000/-మాత్రమే కాబోలు జమకూడినవని తెలియుచున్నది. మేమిది ఈసభా నిర్వాహకురాండ్రయెడ ద్వేషముచే చెప్పుమాటగాదు. వారియొక్కయు వారుతలపెట్టిన కార్యము యొక్కయు యోగక్షేమములు కోరిచెప్పుమాట. వారీసభానిర్వాహకమునకై చేసినజమలు, పెట్టిన ఖర్చులు మాకు వ్రాసిపంపుచో సంతోషపూర్వకముగ నచ్చువేతుము. మేమీవ్యాఖ్య అచ్చునకిచ్చునప్పటికి మరొక వింతవార్త చూచితిమి. ఈ డిశంబరు 4, 5 తేదులలో కాకినాడలో 19 వ ఆంధ్రమహిళామహాసభ జరుగునని కొందరు ప్రకటింపగా, అది అనుమతిలేనిసభ—అఖిలభారత సంస్థకు సంబంధించినదికాదని కొందరు జిల్లా సంస్థల కార్యనిర్వాహకురాండ్రు ఖండన ప్రకటించిరి. ఇది ఇటీవల ఆంధ్రదేశమున చెల రేగిన కమ్యునిస్టు కమ్యునిస్టేతరస్త్రీ సంస్థల కోలాహలమా, లేక సామాన్యముగా మూడుకొప్పులొకచోట కూడజాలవని పురుషులాడి పోసుకొనుటకు తగినట్లుగా ఋజువుపరచుకొనుటా?

## నూతన భారత రాజ్యాంగ చట్టం

నూతనభారత రాజ్యాంగచట్టంచిత్తును ఇదివరలో విమర్శించియున్నాము. అందులో స్త్రీలకున్నూ పురుషులతోపాటు అన్నిటిలోను సమానమైనహక్కు ఏర్పరుస్తూ ప్రాథమికహక్కులు నిర్మింపబడియుండెను. అవినేడు కాన్‌స్‌అస్సెంబ్లివారిచే ఆమోదింపబడినవి. కావున వారినిందు కెంతైనా అభినందిస్తున్నాము. అయితే హక్కులేర్పడగానే అంతా ఒలకలేదు. హక్కులతోపాటు ఏర్పడ్డ విధులుకూడ తెలుసుకున్ననాడే, వాటిని స్థిరచిత్తంతోను సామర్థ్యంతోను నిర్వహించిననాడే, ఆ హక్కులు అనుభవయోగ్యమవుతాయి, సుస్థిరమూ అవుతాయి. ఒకయింటపుట్టి మరొకయింట మెట్టి బాధ్యతగలజీవితం సాగించే "గృహలక్ష్మి"కీ సంగతి చెప్పనక్కరలేదు అయినా తరుణం కాబట్టి హెచ్చరిస్తున్నాము.

## సు ఖ దుః ఖా లు

సుఖదుఃఖాలు సంసారుల వెనవేసుకొని అనుభవానికి వస్తుంటవి. అవి మహాప్రాసాదంలో నివసించే రాజదంపతులకైనా ఒకటే- పూరిగుడిసెలో నివసించే బీదకుటుంబానికైనా ఒకటే. చూడండి గతమాసమున బ్రిటిష్ రాజదంపతులకు దౌహిత్రుడు కలిగినాడా? ఆ శిశువు ఎలిజబెత్ రాకుమారి పిదప సింహాసనమెక్క వలసినవాడుగావున ఆ రాజదంపతులేగాక, ఆ రాజసంబంధముగల యావత్ప్రజా హర్షించినది. ఇంతలో రాజుగారికి కాలు జబ్బుచేసినది. పాదమున రక్తప్రసారమే నిల్చిపోయినది. కొన్నాళ్లవరకు రాజదర్శనము దుర్లభము. ఇదెంతో విచారకరమైనవార్త. అయినా రాజదౌహిత్రునికి ఆయురారోగ్యములున్నూ, రాజు గారికి త్వరలో స్వస్థతయున్నూ కలుగుగాక యని ఆశిస్తున్నాము.

## శ్రీ సూర్యరాయ తెలుగు షైప్‌రైటింగ్ ఇన్‌స్టిట్యూట్

ఈ ఇన్‌స్టిట్యూట్‌వారు ప్రచురించిన చిన్నకరపత్రము మా కార్యాలయమునకు పరిశీలనార్థమంప బడినది. దీనిని రాయ వేలూరులో (తొలుత తిరుపతిలో) శ్రీ ఆకుండి వెంకటశాస్త్రిగారు నెలకొల్పి నిర్వహించుచున్నారు. శ్రీ శాస్త్రిగారు కడుసమర్థులు, వాక్చతురులు. కావున ఇట్టి నూతనమార్గముల

కృషిచేయుట కెంతయు తగినవారు. శ్రీ పిఠాపురం మహారాజావారి రెండవ కుమారులు ఉజ్జ్వలమగు తెలివి తేటలుగల నూత్న నిర్మాణ సామర్థ్యమును వినియోగించి - తెలుగుభాషాభివృద్ధికి అత్యవసరమైన తెలుగుటైప్‌రైటరు కనిపెట్టియున్నారు. దానిని వారు కీ॥ శే॥ తమ తల్లిగారి పేర చిన్నమాంబాముద్రాలేఖిని అని పేరు పెట్టినారు. ఆ పేరునకు మెరుగుపెట్టినట్లు శ్రీ మహారాజావారి పేరట శ్రీ శాస్త్రిగారి ఇన్‌స్టిట్యూట్ నెలకొల్పినారు. ఈ ఇన్‌స్టిట్యూట్‌ను దర్శించిన పెద్దలు - కొందరు ముద్రాలేఖిని సమగ్రముగా సమర్పబడియున్నదనియు, కడుసామర్థ్యముతో శ్రీ శాస్త్రిగారు ఈ సంస్థను నిర్వహించుచున్నారనియు హర్షించిరి. నిజముగా వీరికృషి ప్రశంసనీయము. స్వాతంత్ర్యసిద్ధి-ఆంగ్లభాషను త్వరలో వదులుకోవలెనని ప్రోత్సహించుచున్నది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము, ఆంధ్రభాషను పరిపాలనాభాషగా (రాష్ట్రముమేరకైన) పెంపొందింపనున్నది. కావున తెలుగుటైప్‌రైటర్ అవశ్యము బలీయమైనది. ఇట్టి సమయముల నీశాస్త్రిగారు ఈ సంస్థను నెలకొల్పి కృషిచేయుట దూరదృష్టితో కూడినపని. వీరు తెలుగు తమిళ సమ్మేళన ప్రాంతమగు వేలూరుతోపాటు - తెలుగు ప్రాంతములలోను ఇట్టి సంస్థలు నెలకొల్పుచో - చాలమంది తెలుగు యువకులు దాని లాభమును పొందగలరు.



చెన్నపట్నంలో ప్రభుత్వంవారి

# శరణశిక్షణాలయం

## శ్రీ గవర్నరు సతిగారు ప్రారంభోత్సవం చేశారు.

మద్రాసు ప్రభుత్వమువారి యాజమాన్యాన చెన్నపట్నంలో స్త్రీల యోగక్షేమాలకై కృషి చేసే ఒకశాఖ నడుస్తున్నది. ఆ శాఖకు శ్రీమతి పారిజాతంనాయుడుగారు అధికారిణులు. ఆ శాఖ యాజమాన్యమున ఈనెల 7-వ తేదిన చెన్నపట్నంలో (55, లాక్స్‌లీ హౌస్, రాయపేట) ఒక స్త్రీ శరణ శిక్షణాలయం నెలకొల్పబడినది. శ్రీమతి డా. ముత్తులక్ష్మిరెడ్డిగారు అధ్యక్షతవహింపగా శ్రీ శ్రీ శ్రీ భావనగరం మహారాణీసాహెబావారు ప్రారంభోత్సవముసల్పిరి. ప్రారంభోత్సవము సల్పుతూ శ్రీవారు ఈ ప్రభుత్వశాఖవారి ఉత్తమకృషికి ఇది నిదర్శనమన్నారు. ఇట్టిసంస్థలు ఉపయోగకరమైనపనులు చేసేకొద్దీ ఇచ్ఛాపూర్తిగా సంఘసేవికలు ఈ శాఖకు హెచ్చు తోడ్పడతారు. అదే ఈ శాఖకు బలం - ఈ శాఖ నడపడంలో శ్రీమతి పారిజాతంనాయుడుగారు చేస్తున్నకృషి ప్రశంసనీయము అని కూడా చెప్పినారు.

ప్రభుత్వమువారు ఇదిమొదలుగా ఇంకా ఇలాంటి వెన్నో సాగిస్తారని శ్రీమతి పారిజాతంనాయుడుగారన్నారు. ఇప్పటికి శిక్షణాలయంలో 50 మంది ఉన్నారు. వీరిలో వితంతువులు, విసర్జితలు, అవివాహితలు అన్నిరకాలవారు ఉన్నారు. మూడుసంవత్సరములలో వీరికి మిడిల్ స్కూలు విద్యవరకు చెప్తారు. ఆపిదప వారు స్త్రీయోగక్షేమశాఖలో పనిచేసేయెడల అట్లాగైకొంటారు. ఈ స్త్రీలకే మూడేళ్లలో సామాన్యపు చదువుతోపాటు మంత్రసానిపని, వడకడం. నేయడం, కుట్టుపని. గుడ్డలకంచులు వగిషీకుట్టుపని, కాగితపు పరిశ్రమ, గృహనిర్వహణము, రోగులకు ఉపచారం చేయడం — ఇలాంటివి కూడా నేర్పుతారు. ఇందులో శిక్షణపొందేవారికి నెల 1 కి రు 25 ల వంతున 3 సం॥లు భృతి యివ్వబడును. ఇందుకుగాను ప్రభుత్వంవారు సాలీనా రు 25000 లు ఖర్చుపెట్టను నిర్ణయించారు. ఇందు పేదవారినే తీసుకుంటారు. వీరికి బయట మసలడానికి అవకాశము లేకుండాచేస్తారు. కాని అన్నిసౌకర్యాలు—ఆ వసతి గృహంలోనే అమరుస్తారు. ఈ స్కీము తయారుచేసి ఖ్యాతిగన్న శ్రీమతి పారిజాతం నాయుడుగారు—చిరునవ్వుతో "వారు ఖుషీ ఖైదుఖానాలో హాయిగా గడుపుతారు" అన్నారు. ఇందుకు ప్రభుత్వమువారిని, వారిని ప్రోత్సహించిన శ్రీమతి పారిజాతంనాయుడుగారిని మే మభినందించుచున్నాము.






## అరుణలేఖ

నెల్లూరినుంచి కొత్తగా వెలువడిన సాహిత్య మాసపత్రిక. ఈ నవంబరునాటికి మూడుసంచికలు వెలువడ్డాయి. నెల్లూరు సాహిత్యఖని. అలాంటి నెల్లూరినుంచీ సాహిత్యమాసపత్రిక వెలువడడం ఆహ్లాదకరం. అయితే నెల్లూరు శాస్త్రమర్యాదపాటించే సదాచారప్రవృత్తిగలపట్నం. కాని ఇందులో ఖండకావ్యములు - ఛందశ్శాస్త్రమున అతిస్వేచ్ఛకోరినవైయున్నవి. పోనీ శాస్త్రంలో స్వేచ్ఛనంగీకరింతమన్నా - వానిలో కవితాధారగూడ కన్పించదు; రసము తుంపురలుగా చిందుతున్నవిమాత్రమే. నవంబరుసంచికలో స్వర్గీయ కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు "గులాబితోట" అనే కథ మనోహరంగా ఉన్నది. మూలం, షేక్‌సాదీకృతపార్సీరచన, దానిని తెనుగించారు రెడ్డిగారు. రెడ్డిగారి రచన అమృతప్రవాహము.

ఇందు "రచయితల తాపత్రయం" అనే వ్యాసం రమ్యంగానేయున్నది. అయితే పర్యవసానం శ్రీమతి రజనీదేవిగారు పొరబాటుగా చిత్రించారు. - పత్రికాసంపాదకుని విడిచిపెట్టారు. కాని ఆమె పొరబాటుచేయకపోయినా - చాలావరకు నేటి 'రచనల'కు పర్యవసానంఅదే. పత్రికాసంపాదకుల అవస్థ వ్రాయదలచుకుంటే - "అరుణలేఖ" పుటలన్నీ చాలవు.

సాహిత్య మాసపత్రికైనా, ఇది, రాజకీయాలున్నూ తడువుచున్నవి. దీని సంపాదకులు నారపరెడ్డిగారు; సహాయసంపాదకులు టి. వి. రమణారెడ్డిగారు. విడిప్రతి రు 0-6-0 లు. వలయువారు పత్రికా కార్యాలయానికి, కాపువీధి నెల్లూరు అనివ్రాయండి.

## దసరాకానుక

తలమర్ల - సారస్వతసమితి వారు ఇదివరలో "వసంతలక్ష్మి" యని ఒక చిన్నపొత్తమును ప్రచురించిరట. ఇప్పుడు దసరాకానుకను "విజయలక్ష్మి" కర్పించుచున్నారు. నవ్య కవికుమారకులతో గూడినదిగా తోచుచున్నదీ సమితి. ఈ సమితివారి యత్నములు ప్రోత్సహింప దగినవే. కాని ఒక్కమాట చెప్పెదము. తారుణ్యపు పొంగు దర్శనీయమే యైనను, "ముదిమిన తలజెడిన" వారెల్లరు "ఈర్ష్యాగ్రగణ్యు"లను కొనుట మొదటి పొరబాటు, "వారిని మెడబట్టి నెట్టిన గాని" తమకు ఆవలకు బోవుటకు దారి లేదనుకొనుట రెండవ పొరబాటు ఈ సృష్టిలో నేపదార్థమును వ్యర్థము, నిరర్థకము కాదన్న రహస్యముం దెలియలేడేని అతడు కవి యెట్లు కాగలడు? ఈతలమర్ల అనంతపురంజిల్లా, పెనుగొండతాలూకా లోనిది. ఇది కేవలము ఆసమితివారు వినోదమునకై అచ్చు వేయునదిగా తోచుచున్నది. ధర లేదు.

## శ్రీ సర్వధారినామ సం॥ర మార్గశిర, పుష్యమాసములు.

| | తేది | వారము | |
|---|---|---|---|
| డిసెంబరు 1948-49 సం॥ | 16 | గు | పూ. ○ 19-30 మృ 45-1 శు 39-2 తిథి ద్వయం శ్రీగురుదత్తజయంతి, |
| | 17 | శు | కృ. పా 17.1 ఆర్ద్ర 44.9 ద్వితీయాతిథిః గురుమాఘ్యారంభః. |
| | 18 | శ | ద్వి. 14.1 పున 42-3 బలరామజయంతి |
| | 19 | ఆ | త. 10-18 పుష్య 39-7 ది 1-4 సంకష్టహరణ గణేశవ్రతం. |
| | 20 | సో | చ. 5-39 ఆశ్లే 35-45 వై 14-6 ది 10.1. |
| | 21 | మం | పం. 0-7 ఉపషష్ఠి 55-1 ది 3.46. |
| | 22 | బు | స. 48.39 పూఫ 27-6 త్రిస్పృష్టకానవమీ. |
| | 23 | గు | అ. 42.41 ఉఫ 23-29 సా 43-47 మకరాయనతోరం. |
| | 24 | శు | న. 37-3 హ 19-20 రా 11 7. |
| | 25 | శ | ద. 32-39 చి 15.48 రా 1-36. |
| | 26 | ఆ | ఏ. 27-51 స్వా 13-4 ది 26-14 సర్వేషాంసఫలైకాదశీ |
| | 27 | సో | ద్వా. 23-39 వి 10 ది 20-3 రఘునాథతీర్థ పుణ్యదినం |
| | 28 | మం | త్ర. 20-51 అను 9-8 వ 20 51 మాసశివరాత్రిః వదశీతిముఖం. |
| | 29 | బు | చ. 19-12 జ్యే 8-51 గం 5-27 శ 19-12 |
| | 30 | గు | అమా. ● 18-49 మూ 9-32 అమాతర్పణం పిండపితృయజ్ఞః. |

### పుష్య మాసము.

| | తేది | వారము | |
|---|---|---|---|
| | 31 | శు | శు. పా 19-41 పూషా 11,8 ఉత్తరశృంగ చంద్రోదయః. |
| | 1 | శ | ద్వి. 22-3 ఉషా 15-1 హ 52.4 ది 26.3. |
| | 2 | ఆ | త. 24-0 శ్ర 19.31 వ 56-47 రా 3-5 |
| | 3 | సో | చ. 30-0 ధ 25-2 భ 30-0 పూషా 3 రః. |
| | 4 | మం | పం. 34-50 శత 31-6 రా 21-30 హరిద్రోగౌరివ్రతం. |
| | 5 | బు | ష. 40-6 పూభా 37-39 సత్యాసుబ్రహ్మణ్య కుమారషష్ఠీ. |
| | 6 | గు | స. 44-59 ఉభా 44-19 ది 4-16. |
| | 7 | శు | అ. 49-49 రే 50-16 ది 17-3. |
| జనవరి 49 | 8 | శ | న. 53-58 అశ్వ 55-19 రా 17-1 |
| | 9 | ఆ | ద. 56 58 భర 49-40 ది 21 3. |
| | 10 | సో | ఏ. 59-2 కృ 60-0 రా 3-26 వైకుంఠముక్కోటేకాదశి శ్రీరంగక్షేత్రే [ద్వారదర్శనోత్సవః. |
| | 11 | మ | ద్వా. 58-50 కృ 2-12 కూర్మద్వాదశీ. |
| | 12 | బు | త్ర. 50-49 రో 3-54 ది 18-9 |
| | 13 | గు | చతు. 55-21 మృ 4-18 ది 25-3 |
| | 14 | శు | పౌ. ○ 53-4 ఆర్ద్ర 3.37 ఉత్తరాయణపర్వ ముఖ్యపుణ్యభోగి సంక్రాంతిపండుగ. |
| | 15 | శ | కృ. పా 49-50 పున 1-50 పుష్య 47-41 సావిత్రిగౌరివ్రతం. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd,
15, Westcott Road, Royapettah, Madras Editor · Dr. K. N. Kesari.